శ్రీరస్తు.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

# కాలజ్ఞాన తత్త్వములు



పబ్లిషర్.

కె. సీతారామయ్య

శ్రీ విఠల్‌విలాస్ బుక్ డిపో.

కడప.

[వెల 0-8-0]

1946

శ్రీ

# శ్రీ విఠల్‌విలాస్ బుక్ డిపో వారి

స్వంత ప్రచురణములు.

శ్రీ శ్రీ శ్రీ అన్నావధూత స్వాములవారిచే రచింపబడిన

## శ్రీ అఖండ భోదానంద కందార్థములు.

ఇందు ప్రతియొక్క మనుజునికి ఆత్మసమాచార మంతయు
పూర్తిగా తెలియులాగున వున్నది వున్నట్లె వివరముగ రచించిన
గ్రంధ రాజము, వెల 0-6-0

కాలజ్ఞాన తత్వములు. క్రౌన్ సైజు — — 0-8-0

వచన కాలజ్ఞానము — — — — 0-5-0

నారాయణ శతకము. — — 0-2-0

శ్రీ సింహాద్రిపుర దిగంబరస్వామి జీవితగీతావళి 0-'-0

ఆంధ్రదేశంబంతటను ప్రఖ్యాతిజెంది యిప్పటికి రు 75000 వేల
పుస్తకములు ఖర్చు అయినటువంటి

## శ్రీ పాండురంగ బృందావన సంకీర్తనలు.

గ్రంథకర్త:— పం॥ భక్త ఏ. నారాయణదాసుగారు రచించినది
13 వ కూర్పు 21 ఫోటోలతో వెలువడినది. వెల 0-12-0

మా గ్రంథములకు వ్యాపారస్థులకు మంచి కమిషన్
యివ్వబడును.

ఇట్లు విధేయుడు
కె. సీతారామయ్య.

శ్రీ గురుభ్యోనమః
శ్రీ గురుఅల్లాడుపల్లె వీరభద్రాయనమః
పోతులూరు వీరబ్రహ్మంగారి

# కాలజ్ఞాన తత్త్వములు

---

పరిమి వీరాచార్యులు అయ్యగారు నిత్యసేవాధురంధరులు సత్యము తప్పనివారు ధర్మాత్ములని పెద్దలు నిశ్చయించిరి.

శ్రీమద్వేదాగమ ప్రతిపాదిత వీరశైవాగార సంపన్నులయిన శ్రీ గురుమల్లికార్జున భ్రమరాంబా వరప్రసాదకులయిన అక్షయాచార్య షడక్షరనిరాధార స్వాములవారిపరంపరులగురాజశ్రీ కందిమల్లయ్యపల్లె పోతులూరి వీరబ్రహ్మముగారికి యుష్మత్పద సేవాధురంధర ప్రియశిష్యుడు సుభాయిలాకాగని యాత్మకూరు కాపురస్థులయిన పరిమి గురులింగ జ్యేష్ఠకుమారుడువీరాచార్యులు అనేకవేల శిరస్సాష్టాంగ నమస్కారములు స్వామీ.

## గురువు శిష్యులకు విన్నవించు సీసపద్యము.

అటువంటి వంశకుండిటువంటియోగంబు నంతింత శిష్యుప చెవ్వరాదు, శిక్షించి కాంతి పరీక్షించి తనశిక్షనోపికతోడను జెప్పవలయు. తనశిక్షనొప్పని తామసాత్మునకు తత్త్వంబు జెప్ప తా వంచుడగును వేష భాషలచేత విఱ్ఱవీగుచెకాని వాడు తత్త్వజ్ఞుడు కాడుకనుక. తొలుతనీవిటుశిష్యుని గుణములన్ని చూచి దిట్టుచు సుగుణములను చెప్పగావలె తన శిక్ష నొప్పకున్న, నూరకే శాంతిబొందియు నుండవలయు॥

## సంధి వచనము.

పూజకు నేనొస్తి బ్రహ్మపూజకు నేనొస్తి పూజకునేనొస్తి పున్నమవెన్నెల కాయముసిద్ధిని కలిపేటి వస్తువ ॥పూ॥ మనసున

నుదకము మాయరూపం అగ్నిక్రోధం బుద్ధిగంధం చిత్తంశిలాక్ష
తలు తీసుకరమ్మనే ఘనుడు వీరబ్రహ్మముసకను॥ పూ॥ ఏమిమెట్ల
విచ్చేనవెనుక వెలుగుబాటి పువ్వులుకోసుక అఖండతేజం వెలిగే
గురుని ఆత్మపూజలు చేసెటందుకు॥ పూ॥ మొదలును కాళ్లను కొ
మ్మలు చేసెటందుకు చెవులు ముక్కులు మొగ్గ కన్నులు నాగ
మల్లె పువ్వులు తీసుక॥ పూ॥ నమ్మిక నాగాభరణంబు తీసుక నాలుక
నారాపాత్రచేసుక వేసుక మంగళ హారతి తీసుక చూపు రూపు
నైవేద్యం శివునికి తీసుక ॥ పూ॥ పలుపుగంట ప్రాణజంట ప్రపం
చమంతట అఖండ పోతులూరు వీరబ్రహ్మము.

వచనము

నేజూచినానే బ్రహ్మమునాలో నేజూచినానే సద్గురునాలో
నేజూచినానే ॥ నే॥ నేజూచినానమ్మ నెలతరో తారక రాజయోగము
నందు రంజిల్లునాగురుని॥ నే॥ కన్నులనడుమాను సన్నంవుదిద్ది నా
తిన్నాగవెలిగేటి పున్నమ చంద్రుని ॥ నే॥ ఫాలభాగమునందు నీల
జ్యోతులనడుమ నోలలాడుచున్న వరలింగ మూర్తిని ॥ నే॥ చూ
పులలోపల పాపలనడుమను వ్యాపించి వెలిగేటి ఆపరంజ్యోతిని
॥ నే॥ చక్షురాగ్రమునందు పశ్చిమవీధిని నిక్షేపమయి వెలుగు సాక్షి
భూతుని నాలో ॥ నే॥ చందమామకు నడుమ కుండలాకృతి యని
ఆనందముగ నేడు హరిపోతులూరయ్య ॥ నే॥

వచనము.

పాలోయమ్మపాలు నాదేహమెరుగని పాలు పాలుపాలు
యని ప్రణవము పట్టుక ధారణచేసే ధీరులకెల్లను ॥ పా॥ పెరుగో
యమ్మ పెరుగు సద్గురుని కృపచేగల్గు పెరుగు అయిదింటను తర
చినముక్తికాంత ముదమున జిలికిన ॥ పె॥ చల్లో యమ్మా చల్లా
సద్గురు వాక్యంబె నెగచల్లా చిల్లి బహుఖేచరి ముద్రయు సత్యాశ

వీధిని సమరసమైన ॥చ॥ వెన్నోయమ్మ వెన్న సద్గురువాక్యములే విన్నా వెన్నా. శశికన్న శిఖామణికన్న శివపరులయిన వారికి ॥వె॥ నెయ్యో యమ్మనెయ్యి మనవీరబ్రహ్మముపై నెయ్యినెయ్యినెయ్యి ఆరుమూడింటను ఆపరంజ్యోతి యనుభవపరులకు ॥నెయ్యి॥

వచనము.

ఈశ్వరీ నిన్నే నమ్మితి భూలోకమాతా ఈశ్వరీ నిన్నే నమ్మితి ॥ఈ॥ ఈశ్వరమ్మ నీవుగాక మోక్షమిచ్చు యెవరివశము సాక్షిపెట్టి నిన్నునేనొక దీక్షచే సాధింతునమ్మ ॥ఈ॥ చూపులోనె రూపమాయె చూపురూపు యేకమాయె పాపలా నడుమాను వెలిగే పరంజ్యోతి యీశ్వరమ్మ ॥ఈ॥ మూడుమూర్తులాకునీవు మూలమైన దేవతనుచు నామనంబున యీశ్వరమ్మను మానకను నే పూజసేతు ॥ఈ॥ భక్తకోటి జనులకు ముక్తినిచ్చిన యీశ్వరమ్మశక్తిరూపము దాల్చినీవు భక్తులనురక్షించుతల్లి ॥ఈ॥ ఇన్నిమాటలేల నాతో కోర్కెతీర మోక్షమిచ్చి సచ్చిదానందాము వెలిగే సన్నిధి జనని యీశ్వరి ॥ఈ॥ కందిమల్లయ్య పురవరములో మందిరమున వెలసియుండె యింద్రుడైన పోతులూరి వీరగోవిందమ్మ జననీ ॥ఈశ్వరీ॥

వచనము.

పనికిమాలిన బ్రహ్మజ్ఞానము పలికితె బ్రహ్మంబయ్యేనా పిబాదిలాసుక పూర్వకాలంబున పొలువుగ బాడీదై పుట్టినా॥ప॥ తత్తరపడి యాచదువులు చదివితె తత్వధారంబయ్యేనే ॥వృత్తము మైననూరేండ్లుదాటితె పుత్తమపురుషుండయ్యేనా ॥ప॥ జాతెరుగకను జడదాల్చితె జన్మరహితంబయ్యేనా నాడునేదనక నాభ్యములోపల మేడకాంతియు చేరవలెగా ॥ప॥ రంగుగ గడ్డము బెంచక యుంటె రాజయోగిగా బోవునా శృంగారముగ పోతులూరి సుబ్ర

హ్మణ్యమును చేరవలెన్॥

## ద్వి ప ద లు.

అని వీరభోగ వసంతుని కరుణ మనమున సంతోషమహి సుజాని భాషించినప్పుడు బ్రహ్మంబులేచి కారణయోగంబె కను పించువరకు వీరభోగ వసంతుడై పుట్టియున్నాడు పూజసేయరె మీరు పుణ్యాత్ములార ఆనందాశ్రమమందు నమరియున్నాడు ఆ రామయోగైన అయ్యవారున్ను మేముభైరవానంద యోగిన్ని వారును చిదంబర వర దీక్షితులును మేము బనగానిపల్లెలో నిల్చి యున్నాము. నిర్మాణమునుచేసి నిల యేడాశ్వాసములు కాలజ్ఞాన పత్రిక కలయంగనిట్టి కాలజ్ఞాన మహాత్మ్యంబు కలియంగపలికె అలించివిన్నను నకాలమృత్యువులు కోలాహలంబుకిల వచ్చినాను శూల ధరుండు శూలంబులన్ బేర్చు కలకలాఖిల జాలంబు కైవల్యబయము నొందింపుచునిపుడు సుజనులార వినుడి జయ మునొందుచుమీరు జయభక్తికోరి ఓంకారమనియెడి యొక్కడే గురుడు వీరభోగవసంతుడై పుట్టియున్నాడు కానకయున్నారు. కర్ములై జనులు కారణంబులు ముందు కానవచ్చెదును॥

## వ చ న ము.

ఇదిగో కాలంబువచ్చెనూ హెచ్చరిక హెచ్చరిక మిన్న దిగో ప్రభువు మెచ్చునూ యిదిగో కాలంబు వచ్చె అదియేమో యనిమీరు మదిలోనె అనుమాన మేలనయ్యా పదిలాము భేతాళ పంపూ భాధలకు బెదరాక గురు ధ్యానం చేసుకోరయ్యా ॥ఇ॥ఇన మండలముననుండి ఇనతేజులిద్దారు యినరూప అస్త్రాద్రికేగిరయ్యా మననేల భూభార మణగి నిషిద్ధాము షునుల చేపట్టితే కడతేర రయ్యా ॥ఇ॥ బంగారురెక్కల పక్షులైతె రెండు భావంబులో

దృష్టా మాయెనయ్యా సంగతిదప్పిన నరులనెల్లనుబట్టి భంగుల
చేడి వుండరోరయ్యా ॥ఇ॥ తండ్రికొడుకులున్న తావునను బోయి
దండము తీసుక జరిగిరయ్యా కండాగలవార్ని కండాలు తరిగే
రు కారాణ పురుషూల కనితిరగరయ్య ॥ఇ॥ పది యేడింటి వార్ని
పట్టుకోనిపోయి ఘాషింప బ్రాహ్మణుల బంపిరయ్యా వేడుకతో
శివపోతులూరయ్యకు పట్టాభిషేకము సత్యమేనయ్యా ॥ఇ॥

## ద్విపదలు.

వీర ధర్మస్వామి విభవంబు మహిమయు భావించిచెప్పెద
బాగుగ వినుడి చెన్నొంద వినవయ్య చెవులు పండువులుగా •
కమలాలయతోడ కమలనాభుండు రమణీమణిగూడిరా ధర్మరాజు
లును కదలివచ్చెనుచూడు కలికి రూపమున ముదమందు చుండు
రు మూడులోకముల ముగ్గురు త్రిమూర్తులు ముచ్చటలు సేయ
మూడుకోట్ల జగములు ముందరగొలువ నాలుగుకోట్ల తురంగ
ములు నలువంక రధములు నాలుగుకోట్లు ఏడుకోట్ల దేవతలు
హేమమును పదునెనిమిది కోట్ల భట వీరభటులు పదము
బాడుచువెంట పద్మినిస్త్రీలు ముప్పదిమూడు కోట్ల మూకల
తోను అప్పయ్య కధవిని అనందముననూ • ముత్యాల చరిత్రి
ముల్ మందమొప్పగొలువ సత్యవంతులుగూడి సంభ్రమ మొం
దుచును భేరి వేయించెను భీకరముగాను ధారుణిలో ప్రజల
తల్లడింపచును శరణు జొచ్చిన వాని సేవకుడమచు కరుణతో
రక్షించి గారవింపుచును. వెనుకకు వాద్యముల్ మున్మంది
బ్రోయ గరుడ గంధర్వులు గనుగొనువేళ భక్తిచే రాగములు
బాడుచురాగ సిద్ధ విద్యాధరులు సభ చేసియుండ దేవకన్యకలు
వింజామరలు వీవ నందీశ దుందుభులు నట రేగిగూయ పుష్ప
వర్షములు గురియ పురహర ప్రియుని అనందగురువుల అనుమతి

చేత భావసంధికివచ్చి షక్త్రవత్సరుడు ఆదికేశవులకు అభయంబు నిచ్చి ఆదిలక్ష్మినిగూడి ఆనందమొంది సిద్ధాద్రినామసంవత్సరము నందు బనగాని పల్లెలోపల గంగనిలిచి రత్నసింహాసనమెక్కియు తాను కృతయుగ ధర్మంబునడిపించుకొరకు వీరపసంతుడై వచ్చి యున్నాడు, కానకయున్నాము. బ్రహ్మంబెమాయ కారణంబులు ముందుగానవచ్చెడు

వచనము

మదకాములారా గురుని మరయున్నారే। తల్లీ మరువక యీశ్వరమ్మను మదిలోనెంచండి.తల్లి।ను మాటిమాటికి హరుని నామము మాటమీరిన నాటకున్న నిశాటులగోట మీటి త్రోయ గురుదుతల్లి।మ। చేరుగొంటె తనమునసాగురుబాగానున్న వాని పట్టి చెట్లకేలరీతు దొడ్డిజీవులానుమీరు తల్లి।మ। మిక్కిలిగాకక్ష తూర్పుననొక్కటి అక్కబుట్టి రక్కసి భూతములెల్ల గ్రక్కున గూల లయము జేతునుతల్లి।మదకా। నందికొండలోపలాను నా ధారిమైనకత్తిపట్టి చండి భూతములాడుచుండు నిందువేడుకలను గానుతల్లి।మ। ఒప్పుగాశివపోతులూరప్పాను మదినుంచితేను ఒప్పు గస్థిరసంపదాలు యెప్పాటికిచ్చు గురుడు।మ।

ద్విపదలు

వీరుడుశూరుడు వీరాంకుడితడు ఘనపరాక్రమముగలగరుడ వాహనుడు రౌద్రాకారుండు రామచంద్రుడు గురుడై తీవిగా రావ ణయుద్ధంబు ఆ లంకగాల్చిన అంతకుడితడు ఖడ్గ శూలంబుగని కరుఖచేత మీరియుండిన వీరరాఘవుండితను హిమవద్గిరి యందు నుబోయి భానువాసరభరణి నక్షత్రము నందు ఖర నందమనో ధ్య కాలంబునందు పరమసంతుష్టుడై యిలలోను బుట్టి పాతాళ

లోకముల్ పట పటపగుల భూలోక సువర్లోక మహర్లోకములను భూమిపైమంటలు భుగ భుగలేపి ధాముధూములు జేసి ధూములులేపి పగిగ వెగసిమిన్ను పాలించి చూచి పగలు చుక్కలు రాలె బక బక నవ్వగా తపసులవుడు గడ గడ వడకి పెల్లార్చి కూతలు పెడబొబ్బలుపెట్టి హుంకారములు జేసి జలధిపై అప్పుడు నిండు జలంబులు నిర్జలంబవును గురుతుగా శ్రీశైల గుళ్లకు బోయి మల్లికార్జునుజూచి ముచ్చటలాడి చంద్రగుప్త మహారాజు అనియెడివాని పాప విమోచనంబు సేయగా నపుడు కానక యున్నారు బ్రహ్మమును మీరు కారణంబులు ముందు గానవచ్చెడివి ॥

## తత్త్వము

రాక్షసుల కులమును నీమసేము శ్రీరాములు జననంబయి నాడు అక్షయమున తాదిస్వవత్సరంబందు ప్రకాశంబైనాడు॥రా॥ శిక్షసేయ దుర్మార్గులమీద శస్త్రముల బంపిస్తున్నాడు॥ యీక్షితిలో పల మానవ కోటికి వింతలు విహరిస్తున్నాడు ॥రా॥ రక్షించెదనని కొందరితోడను రహస్యములాడుచున్నాడు ॥రా॥ అన్నాతికి తనిచ్చిన మాటను ఆలోచించుచున్నాడు ॥రా। పన్నగేంద్రుడు భృగు పాశాంకుశ ధరులన్నిట నిలచెనన్నాడు ఆకాశంబున ధర్మదేవతా ఆర్భటించుట నిజమన్నాడు ॥రా॥ జోకతో ఆధ్వని లోకములో విని చీకాకౌతుందన్నాడు ముందు మార్గశిరాష్టమిలో యుగసంధి బుట్టుట నిజమన్నాడు. ॥రా॥ ఇందుకు పర్మము మానవలోకములో ముందుకైన నేనన్నాడు। యందుకుదప్పితె హీనజాతి వానింటనే బుట్టెనన్నాడు ॥రాక్ష॥ తుచ్ఛకులము ముల్లాకున ముచ్చట లడుగు మన్నాడు తప్పగాదికి విశ్వకర్మలకే దారబోస్తి నిజమన్నాడు ॥రా॥ నూటయెనిమిది యేండ్లు కృతయుగ ధర్మము

నడిపే నన్నాడు॥ వేడుకతో శివపోతులూరిలో వెలుగుచునుండె నన్నాడు,

ద్వి ప ద లు.

కల్పవృక్షము కతపాలధరుండు పక్షివాహన గురుడు లక్షణదేవ నక్షత్రమండల నాగనరేంద్రు జంబుగంభీరవో జం భారవినుత వేదండగమన ఓంకారపరివేరి తొమ్మిది శివునిగన్న ఖండదేవుండు ఆది బ్రహ్మంబు గుంటపైనిలిచి — లోగంట వాయించి మిట్ట కెగసి గురుని జంటను నిలిచి అలింగనముచేసి అంతటనిలిచి అధర్మవర్తనుడు వచ్చిన కార్యంబు బంగారుదెరిగి మెచ్చితి అడుగుమన్నె మేఘ వాహనుని , దక్షిణ శ్రీశైలధాము డు ఆతడు లక్ష తొంబదివేల ప్రమదలు గూడి అక్షణంబున నే మొ అనుచు నున్నాడు

త త్వ ము

దండివాడవురా పోతులూరయ్యా దండివాడవురా దండి వాడవు వీర చండ ప్రచండూడ నిండులోకమునందు నిలిచి వెలు గుదువురా ॥దండి॥ దండకారణ్య బ్రహ్మండమైన అడవి దండి పాపము గన్న గుండవురా నీవు॥ దండి గుందము గడచి లో కుండలిపై లేపి గుండ మీదికి లేచి యుండే ఘనుడవు నీవు ॥దండి॥ యెంతవాడవునీవు అంతరంగుడావు యింత నిర్మర దే హము వీర బ్రహ్మమురా॥

ద్వి ప ద లు.

అధికారహర పరాత్పర మూర్తి గురుడును సంతోష వరణి దానొంది అడినమాటయు ఆలించి వినియు పోతులూర య్యకు అతిభక్తితోను అడదొడగెను యేమో ఆది శంబునితో సకల అధిపతిరుద్రి సత్య సంచార ఆర్యామనోహారు చా దిసం

## కాలజ్ఞాన తత్త్వములు.

ఘుండు సకల గుణేంద్రి ఓసన్నుతలీల, కాలహరణంబు యీ క
రివరదునకు మనవి యొక్కటి విన్నవించెద మహాత్మా॥

### తత్త్వము

అగ్రాజునెదుటా వీరబ్రహ్మం ఆగ్రహుండయి పలికె జా
గ్రాజు నెదుట వీరగ్రహుండయి పలుకా భర్గవధాముదే మానుమ
న్నాడు ॥అ॥ విగ్రహాను గ్రహశక్తి జాగారిగలసింహ వ్యాఘ్రి
దై అపుడు పరాక్రిడనెనా ॥అగ్రా॥ కదలవిడిచి లోపవన వీధిని
అధారచక్ర పురధారూఢవని ॥అగ్రా॥ శ్రీరామ గురువి అనుగ్ర
హము వచ్చి నీలాద్రుడు అపుడు పరాక్రిడనెనా ॥అగ్రా।

### ద్విపదలు.

మదపుటేనుంగుభంగి మహిమీదజములు, మదిలోను ద
లపక మత్తులైయుంద్రు ఖండింతురాలించి కరుణించివేగ దండిగా
కర్మల దగ్ధంబుచేసి గరగరయని పొడుతు ఘనశూలములతో
మేరదప్పిన వాంద్ర రెక్కలు విరుతు కల్ల నిజములు రెండు
కానక కూసె కాకులన్నిటిని కలిలో కరగింతు దండగ ద్రోహ
ముల్ గొనియేటి నసుల వజ్ర దండంబుతోను వసుధ జేసెదను
అండజవాహన ఆజ్ఞయిమ్మువేగ.

### తత్త్వము

వినుడీ బ్రహ్మముమాయవినుడీ వినుడీ జనులారా దుడుకులు వి
డుపండి తడవుసేదు వీర సురుడు బల్కినవాక్యం ।వినుడీ। శంకా
లు జేసెటి కుంకాలనందరిని లంకిణి పల్లెకు జంకించు చూపును
।వినుడీ। చండిరాజ్యమునుంచి దండుమారివచ్చి చంపివేసేటి వేళ
ఆండానెమ్మీకు ఆకాశవీధిలో రాకాసిగుంపులు కేకలు బెట్టు
చూ వచ్చేకాలమాయె ॥వినుడీ॥ పోతూలవలె మీరు హేతువు
తెలియక పోతుబూని గురుడు హేతువు దెలుపును ।వినుడీ।

## కాలజ్ఞానతత్త్వములు

ఒప్పుగాను శివపోతులూరి సుపడు యెప్పుడో ఏ వేళనో వచ్చియు
న్నాడని ।వి।

### ద్విపదలు

విజయనగరపు రాజు వింటి దొడ్డవాడు కంటిమంటగల
చండవా డొకడు లోకాధి గురువై రితోక గలవాడు తాను తానై
రాజ గర్భమున బుట్టి వీరభద్ర యంకార విఘ్నేశ యనుచు,
పావములోపల భక్తియు నిలిపె . అంతర్ధానియై అపుడు
చనుదేరె।

### తత్వము

చెప్పవేదంటనక పొయ్యేరు నరులార గురుని చేరి మ్రొ
క్కితె బ్రతుక నేర్చేరు ।చె। చెప్పలేదంటనక పొయ్యేరు తప్పు
దిదిగో గురునివాక్యము తప్పు త్రోవల దోవు వారల చప్పరించి
మ్రింగు శక్తులు ।చె। మొప్పెతనమున మోసపొయ్యేరు । అది
గాక కొందఱు గొప్పతనమున గోసుమీరేరు ఇప్పుడప్పుడనగ
రాదు ఎప్పుడో ఏసేళనోమరి గుప్పుగుప్పుని దాటి వాయెడు
గుఱ్ఱిపడుగులు యేరుపడును ।చె। తానుతప్పము తలచకున్నారు
తార్కాణమయితే యెక్కువతో దెలియ నేర్తురు జోకతోడుత
తల్లి పిల్లలు జోడుబాసి యడవులందు । కాకిశోకముచేసి పక్షు
లు కాయగసురులు నమలిచత్తురు ।చె। కేకవేసియు ప్రాణ మి
డిచేరు రాకాసిమూకలు కాకబట్టి కలువరించేరు । ఆకాశము
యెర్రనౌను అయుమతములు ఒక్కటవును । లోకమందున జను
లు అందరు నీరునిప్పున మునిగిపోదురు ।చె। ఆగలువిడిచి పొ
గలుదాకేరు । అదిగాక పట్టపగలు చుక్కలను చూచిభ్రమసే
రు ।చె। ఘుగులు ఘుగులు ధ్వనులు మింటను పుట్టియేగిన పి
మ్మటను దిగులుపడుచు ప్రజలుచాలా దిక్కులేని పక్షులవుదురు

## కాలజ్ఞాన తత్త్వములు,

।చె। పాతకూలు పడఁగలిసేరు పుణ్యాత్ములయిన సాధుకూలు సంతసించేరు భూమిమీదా ధూముధాములు పుట్టిపెరిగిన పిమ్మటాను రామరామ యనవారలు రాలిపోదురు తెలిసికొండి ।చె। ఏమొఏమో యెరుగకున్నారు ఎండెండుచూచిన యమునిపురికే నడువమందూరూ భూతలంబున నిట్టివింతలు పుట్టియణగిన పిమ్మటను నీతి కృతయుగ ధర్మమప్పుడు నిజమునిలకడమీద తెలియును ॥చె॥ ముందువెనుకను గానకున్నారు మూర్ఖులై భువిలో ముందుగతియు నెఱుగకున్నారు కందువతో పిన్న పెద్దల కన్నుగానక గర్వములచే మందె మేళము లాడువారిని బందు బందుగ గోతురక్కడ ।చె। కీడులయినను కూడదందురు ఒనగూడినప్పుడు యేడజూచిన వాడుకొందురు వేడుకతో పోతులూరివీరభోగ వసంత రాయలు యేడు దీవులు యేకచక్రము నేలను బ్రహాండ మంతయు ॥చె॥

నల్లపాటి పూరి నట్ట నడుమాను యెల్లపురము వురిమి నెల్లాండ్ల బాల నేరుపుతో బుట్టె నెరణాణ యొకతె కరమున ఖడ్గంబు విదిసి వుంద్రంబు కేచరంబునకెగసి శంకరా యనుచు ఓరి వూర జ్వాల లుప్పొంగజేసి తాళలేకారులు తల్లడింపూచు. తల్లిపిల్లల విడిచి తత్తరిగొనుచు కారడవులకేగి కన్నీరుబెట్టి యడల శోకంబున యెక్కంగజనులు కొంత గృహంబందు ఘోషింపుచును అడలుచు జనులంత హాతమౌదురచట ఆనంద యోగంబు నడిపించు గురుని గానకయున్నారు బ్రహ్మంబు మాయ కారణంబులుముందు గానవచ్చెడివి।

## వచన తత్త్వము

ఇంతటను విడిస్థలంబిది యెవరె కలవి యగును సంతతము శివధ్యాన పరులకేకాక యేడు చుట్టుకోటయేకచక్రదిశమాను

మని తెలియక మగువడి గూడి చూడ జూడ తర ఏ స్వామి వి ధులు గలవు పండువెన్నెలకాంత నిండిన గురుడు ॥ఇంత॥ నలు గురు మంత్రులు నాయకులేడ్గురు కరణాల ఆర్గురు ఘనముగాను వలువదెనమిది పదులు నరులుచెప్పెటివారు ముప్పది యైదుగు రు ముసద్దీలు గలరియా. ఇంతయెనిమిది పదకరులు యేడువేల రథాలు పదహారు లొట్టిపిట్టల్ బారుగొలువుగను యేనూరు అ శ్వములు యేవేళ కొలువగను, యెప్పుడు డెబ్బది రెండువేల కాల్బలమూ, యెంచయేదిన్న ఐదుగురు మాభటులు సామంతు లు పదినూరు తలవర్లు ప్రహరి దిరుగగను ప్రణవభేరి మృదంగ పంచమ ధ్వనులచే పగలు రెయును మహాప్రబం గోష్టులు ॥ఇం॥ పశ్చిమ ధ్వారము పద్మరాగపు కాంతి పదినూరు స్తంబాలబారు మండపపు పరమగురుడై లింగబావ సిదేశ్వరం పసిష్ట పోతులూరి శుభకల్యాణ గృహాము ॥ఇంత॥ బలు విడిస్థలంబిది యెవరికలవి యగును. సంతతము శివధ్యానపరులకేగాక॥

యాలలు

శరణు పోతులూరి రాయ శరణు వీర భద్రరాయ శరణు వో దైవరాయా ఓ పోతులూరయ్య కరుణతోనె మమ్మేలరా ॥శ॥ సూక్ష్మమైనా తనువులోనా కూరుడె వున్నాడయ్యా కూరుడున్న దారితెలిసితే వో పోతులూరయ్యా మోక్షద్వారమున కనుల చూచేనా ॥శర॥ కాయజాని తనువులనే కామూడేవా వున్నాడయ్యా కామడున్నా దారితెలిసితె ఓ పోతులూరయ్యా కామాజానికన్నా తంత్రివి ॥శరణు॥ యావనంపు యేటివొడ్డునా జవ్వనంపు జాజి తోట యావనంపు యే వో పోతులూరయ్యా చూడి వేడుకగా నగునయ్యా ఇప్పలేరు దాటవలయు తప్పింతునా ముక్తిమంత్ర ము నివ్వలేరు పీరుజేసుక ఓ పోతులూరయ్యా తెప్పాచేసుక తేలి

వత్తునా ॥శరణు॥ అష్టాక్షరి గండిలోనా చతురాక్షరివీరాదీసి ధర్మ రాజు దారితెలిపితే ఓ పోతులూరయ్యా జూచినేనుకనుగొంటిరా ॥శరణు॥ తెలిసి తెలియని వారికెల్ల యీాలవైడూ తోచూనటా బాలురాకు యేమి తెలుసురా ఓ పోతులూరయ్య బ్రహ్మజ్ఞాను లైతే తెలుసురా॥శరణు॥

అయిధాలరు మంగళ హారతి,

మంగళం మంగళం మనవంశ చిలుకకు మంగళము పెను తోటమాతకిప్పుడు • మంగళము మంగళము మముగన్న తల్లికిన మంగళము శ్రీ వీర బ్రహ్మమునకు మన్నూరు నీరూను మరిషుద్దగా జేసి మయముతో కరములా కొల్వమర్చి కొల్మి కోపముచేత సృతై అను నాకలి కోపంబునటుఎలెను జేసెనిపుడు ।జ। మాకులు దెప్పించి మయముతో చెక్కించి రాజులకు మిద్దెలును రంభలకు మేడలును కాపులకు నాలుగేండ్లు కలగ జేసెటివాడు ఆతడోయి జగతిగురు ఆచార్యలింగ మతడు ॥జ॥ రాతి రూపైన కావించి కాసవరు రాజులా చేతనె మ్రొక్కించిరి సర్వభూషణాలు స్వామికి అర్పితము మ్రొక్కులెల్ల విశ్వబ్రహ్మమునకూ ।జ।పంచ శిరసులు పశ్చిమున వొంచుకొని పలుకుచు వ్రాసెనే పద్మగి న్నె అన్నమన కెవ్వరు సరివారు లేరనుచు కంచాల చేసెటి కందరికిని ।జ। వ్రాచన కోవ్రాలు స్థిరైన కారులు కుదురు కుంపటి లోను పరివస్తువ అదిమీరగ సౌలహస్త గతి లాభము ఆతడో యీజగతి గురాచార్య లింగ మతడూ ।జయ।

వీరబ్రహ్మము మీద మంగళహారతి

జయ జయ మంగళము శాంభవుడయిన శ్రీ వీరబ్రహ్మ కిపుడూ ।జయ॥ బంధూరముగ ఘాటమందే జనితమైన భూతనాధుని గంధాబూతి బూసెదను. విభూతిబూసెదను శిశివమంగ

కాలజ్ఞాన తత్వములు.

శము నీలతోయములోన వోలలాడేటి పూలమేలిమైన శివునిచా పూజింతు ॥జ॥ శ్వేతార్ణవములో మూడెత్తు వాక్షతలుంచి పో లూరు వీరగురుని నొసట వీరగురునినొసటుప ॥జ॥ అవుసురా ర శేషా వృపమూనిబంధించి తపనకుండలి రేపినవుడే ఘూపవ గా ॥జ॥ ఆగ్నేయబిందూ ఆధారపత్మెముసందు ఆశా మానసప అపుడె వెలిగించి ॥జయ॥ బాసురమైన గోనూర నాగేశ్వర దా నేలిన నమ్మిశ్వరక్షకరుణకు ॥జయ జయ॥

పరమ రహస్యము-సంపూర్ణము

---

# బ్రహ్మంగారి తత్వములు

---

ఓం నమశ్శివాయ సిద్దమైన పచివి ఓం కారమేదిరా ఓ ఒనరుగా త్రికూట భూమధ్యమందున్న వాడెవ్వడో చూడరోరి। ఓం॥ అ, ఆ లు యెనిమిది అక్షరములకు మూల హంసవెవ్వడో చూడరోరి ॥ఓ। ఆకారమును చిలుక హంసలో గూడుకొని ఆడిస్తు న్నాడు రోరీ ।ఓం। కా ఖా గా పదిరెండు పర్వములుచేసుకొని కన్ను మూసుకచూడరోరీ కలరేకుతైదునా కాంత యొకటున్నది కరకందుదెరుగురారోరి ।ఓం। తా వ ఛాయని పర్వము తా తెరిగి తలుపుదీసుక చూడరోరీ తెరతేరకాడునై దేవాలయములోన తేటగానున్నాడురోరీ ।ఓం। యరలవ నారాయణ బ్రహ్మరుద్రుడు ఎవ్వడో చూడరోరీ శషసాహాయని శివపోతులూరయ్య సాక్షి గా నున్నాడురోరీ ।ఓం।

పోతులూరి వీరబ్రహ్మముగారి తత్వములు.

ముట్టు ముట్టనియేరు ముట్టరాదనియేరు యీముటు

రక్తంబు యీ శరీరంబూ ॥౧॥ కమలములో యీముట్టు కమల
మని వెలసింది కమలముల లోపల కాంతిగా దుమికెన్ ।౨।
మూన్నాళ్ళు ముచ్చటలు ముట్టనితొలిగుంటె ముట్టులోపల ము
ట్టు ఆసిమేల సమసెన్ ।౩। నెలకొక్కదినమాయె నేర్పుతో ఈ
ముట్టు పోదుతెలియకముట్టు పారాడసాగెన్ ।౪॥ రెండు నెల
లొక దినము అండబాయక రాత్రి శ్రీహరిని వెదకుటకు చిలుక
వలె దిరుగెన్ ॥౫॥ మూడునెలలొకదినము మురికి గర్భము
లోను మూలస్థానమునందు ముదేరుపరచెన్ ।౬॥ నాల్గునెలలొక
దినము నాగ కంఠుడొచ్చి నవమూత్రద్వారములు క్రమమేరు పర
చెన్ ॥౭॥ అయిదు నెలలొకదినము ఆసదాశివుడొచ్చి కంఠస్థా
నము శిరసు క్రమమేరు పరచెన్ ।౮॥ ఆరునెలలొకదినము ఆ రు
ద్ర ఆ బ్రహ్మ అభయ హస్తములిచ్చి ఆయుష్షుపోసెన్ ॥౯॥
ఏడునెలలొకదినము యెరుకాయె జీవునకు మతిలోన వుత్కొట్టి మ
నసుతా దెలిసెన్ ।౧౦। ఎనిమిది నెలలొకదినము యేర్పాటు పిం
డంబు కాంత శ్రీ గర్భమున కదలాడుచుండెన్ ।౧౧॥ తొమ్మిది
నెలలొకదినము ద్వారములు విడువుమని ఉత్పత్తి ఆయెను యీ
పృథివిలోను ।౧౨। తల్లియొక్క తెగాక దంఢ్రులెందరొగాని త
న తప్పు తీర్పుమనిదండములు బెట్టెన్ ॥౧౩॥ ఈపిండ వచనమ్ము
ఈ పిండ శాస్త్రమ్ముకారుపిండముచేత కలినీశ్చుచల్లెసె ।౧౪। మా
యమంత్రసాని మరిపోతులూరయ్య మంత్రములు చెప్పుచు మరిబొ
డ్డుగోసెన్॥౧౫।పఅయ్యగారిసమాధికాడను దూదేకులసిద్దయ్యగారు

## బ్రహ్మంగారి ప్రార్థన.

నమ్మితినయ్యా వోవీరయ్య నమ్మితినయ్యా వీరబ్రహ్మం
నమ్మితినయ్యా మహానుభావా । న ॥ నమ్మితినయ్యా నిన్ను న
మ్మితి తోడూతా నమ్మిన వీరధర్మ సొమ్ముజూపెదాని ॥నమ్మి॥

కాలజ్ఞానతత్త్వములు.

తనవుతోడుత నన్ను పూలకే పొమ్మాని నిజసమాధిలో పండి యున్నావయ్యా ।న॥ అబయలులోనుగురు ధర్మ బయలు జూపే వానికి ॥న। అంటానికులమాని దూదేకేవాడనీ వొంటిగానిజేసి వోతివేమయ్యా- ఆకంటిలో గురుధర్మము కనులజూపెదవని ॥న। శివయోగశివనిష్ఠ శివపోతులూరయ్యా చింతలేక వూరకున్నా వేమయ్యా-చింతతోడు వీరధర్మచింతానమ్మినగురుని ॥నమ్మితి॥

## దూదేకుల సిద్దయ్యగారి తత్త్వములు.

ఏకులమనినను వివరమడుగుతే యేమనితెల్పెదు లోకులకూ పలగాకులకు దుర్మార్గులకు యీదుష్టులకు ।ఏ॥ ఫాలభాగమున యాలలుబాడుచు భావముకన్నది నాకులము ॥ఏ। ముట్టునబుట్టిందీ కులము మట్టంటున పెరిగినదీకులము ముట్టులోహరుడు ముట్టులో శివుడు మట్టులో బ్రహ్మం ముగ్గురు మూర్తుల మూలము దెలిసిందీ కులము ॥ఏ॥ అంగమేమూర్ఖా అనేబ్రహ్మము లింగము ముందర బెట్టుక ప్రపంచమంతా పూజలు నడిపిందీకులము॥ఏ॥ అంగములోనే మేకనుబట్టి లింగముతోనే గొంతుగోసి శాస్త్రమనేపాళ్ళవేసి చతుర్బ్రహ్మలకు పంచిపెట్టినది నాకులము ॥ఏ॥ ఇంటిలోపలను యిల్లుకట్టుకొని మంటలోపల రాట్నంబట్టుక కంటిలోపల కదురు బెట్టుకొని ముక్కులోపల యేకుబెట్టుకొని చెవులోబారా చేతికి తీసుక నారాయణయను నరముతీసుకొని అష్టాక్షరియను తడికె వేసుకొని పంచాక్షరియను పంచదీసుకొని తధిమితధిమి గుబదెబగుబదెబ ఏకినకులమే మాకులమూ ॥ఏ॥ ఏకిన ఏకులు పీకినపిండెలు లోకమంతనొక పాకముజేనుక ఏకిన కులమే మాకులమూ ।ఏ। రొమ్మున లక్ష్మీచీరగట్టుకొని చక్కగా సిరి పావడదొడగి ఆనందమైన వీరబ్రహ్మ శాల్వకప్పుకొని నిండి

యున్నదే నాకులము ఒంటరిగాదే నాకులమూ ॥ఏ॥ గురుజంట తిరుగుచు నాకులమూ అండపిండ బ్రహ్మాండ మెల్లను నిండియు న్నది నాకులము ॥ఏ॥

దూదేకుల సిద్దయ్యగారు చెప్పిన తత్వము

కులమెంచగానేల గుణమెకారణము కులబింయకుల మాయె కులమెక్కువేది ॥కు॥ యోనిలింగము రెండుయేకమై తరచగా యోనిలో పిండము వెడలెనపుడు యోని ప్రజాపతుల యెనసిపుట్టినకులము ఘనమైన కులమేది కానికులమేది కులమెం చగానేల గుణమెకారణము ॥కు॥ చావు పుట్టువు రెండుసమమని తెలియకను తావుకొని ఈక్షణత్రయ బద్ధులైరి దినము రాతుృల యందు శివుని యేమరకను శివయోగమెరిగితే సిద్ధుడే గాదా ॥కు॥ శుక్లశోణితములో లిప్తమైనాకులము యుక్తి తెలిసిన గురుని భక్తి సోహముగన్న ముక్తి బొందిన వారు యెక్కువేగాదా ॥కు॥ కశ్య ప భరత గౌతమ గాంగేయ శుక శౌనకాది మునిసూతులెవరూ ॥ వ్యాస వాల్మీకాది వసిష్టు మొదలుగా వాసిగా సిద్ధగురు యీశుడే గాదా ॥కు॥

యాగంటి లక్ష్మప్పగారి తత్వము

ఎంతపాపికర్మినో నేపూర్వమున శివ చింతసేయక కర్మ జీవుండనైతి నటనంబున సతులు నెలనెలకు నొకసారి ముట్టు ర క్తము జూచి ముట్టురోసి అట్టి అండాండ ము రక్త శుక్లము బ లిసింది యీపైన ఈదేహమిదియెకాదా ॥యెం॥ మొదట కష్టంబ గుచు మురికి గర్భములోను పుదయించిన దేహమిదియెకాదా ప రగ మలమూత్రముల పునికిపట్టయిపట్టియు ఇది ప్రత్యక్ష నరకం బు కాదా ॥యెం॥ పలు బహు యోనికూపమునపలుమారు వెడలిసు ఖదుఃఖములు కుడిచి కడుకర్మినైతియాగంటిసంజయదేవయడను

చేయకు నమ్మేలు స్వామి ।యం।

రెంటికి నడుమా చోటున్నాది దేశేవారికి ఆవి తెలసి తమ మతి నిల్పి దాటిరిపెద్దలు అవతలికి ।రెం॥ రెండు చంకలుల కాయువు గట్టుక రేవు తిరుగుట నేమిటికి రెండువేసుకూ వెలుగించు కొావి వెలుగుచు పదరోఆ వలికి ॥రెం। చీకటి చింతల నడుమను దొంగల భయమున్నది. మనకందరికి గురుమంత్రమనే గుదియ తీసుకొని గుదముక పదరో అవలికి ॥రెం॥ లింగపల్లె పొల మెరిగి దాటితె దొంగ భయము లేదెవరికిని అనువనుమంత్రము యాగంటయ్య చిత్తము గెలిచిన కొందరికి ॥రెంటి॥

బ్రహ్మంగారి తత్వము

చెరుగు డాడెనె బ్రహ్మం బలిగు డాడెనే చెడుగుడు గుడు గుమ్మన్నాధం కలుషబిందుల కనుల గూవక నడిచికుమంచి వడిగల తనయునిచె చైత్రిమించిన నిండు పౌర్ణమిగ వెన్నెల గాయ ఈకటముగ్గుఅకట నవుగుదు నడమన్ నబుపై బుజ్జివకడు చెట్టు కొట్టగా పాలు కారగా ।చె॥ ముప్పైరెండు అక్షరంబుల మేలైన వొక అక్షరంబె కై గుబికై గుబ్బ బట్టి నాలుగు మెకములె వలుగురు తరిమిన దిక్కులనె పరుగులెత్తించి చేకొని అయ్యజూచెను ఆనందించెను వింతలు తెలిసిన పోతులూరి వీర బ్రహ్మము ॥చెరుగు॥

బ్రిహ్మంగారి తత్వము

ప్రభువు వచ్చె వేళాయె ప్రజలార యికనయిన భక్తితోను పూర్వ భవముబుడిగి గురుని పంచచేరితేమో శుభములేనూ । ప్ర ॥ ఖండితంబుగా నందిమండల క్షేత్రిధాముడు రెండు యేండ్లు నిండిన నుదయింతురన్నారూ అజిన్నెతోడునేగా ॥ప్ర॥ గుత్తి ఆవవాని కోటా కొమ్మలసందు గురుతు జోడూవేసి

## కాలజ్ఞాన తత్త్వములు.

అతిగా మన్నా మాయరమన్న బూతురు అల్లరాడు ॥ప్ర॥ తుంగ భద్రలోన నగుబారి గుణాళిలు దుముకులాడూ అట్టు దుమికినా మూనాళ్ళ ఆడోవ పోనన్నాజీదోడు ॥ప్రభు॥ కృతయుగ ధర్మము నడిపిస్తూ వాని హితులా కొసగినాడూ వేగ సతతామే పోతులూరు స్వామి సుబ్రమణ్యంవాడూ ॥ప్ర॥

### బ్రహ్మంగారి తత్వము

రమ్మనే మన వీరగురుని రమ్మనే వుపదేశ మిమ్మని క మ్మకొని కనుబొమ్మల నడుమను బొమ్మలాట లాడేగురుని ర॥ నాదబిందూ కళలచేత ఆడుతుండగాను నేను కూడి కుండలి నట్ట నడుమను చూడ సుందరమైన గురుని ॥ర॥ ఆరుమతములందు గురుడు ఆగ్రహించి యున్నగురుడు అరు మూడుతెంచివేసి మూ డు వేలయి యున్న గురుని ॥ర॥ అందమైయున్నట్టి గురుని కను బొమ్మల పైనా కోరగాను బయలుగాంచి పండువెన్నెలలో అంటి అంటా కున్నగురుని ॥ర॥ యెన్నికాతో శివపోతులూరి వీర బోగ వసంతరాయలు యేడు దీవులయేకరాజ్యము ఏలబొయ్యే వీర గు రుని ॥ర॥

### బ్రిహ్మంగారి తత్వము

వస్తాడయ్యా వీరబ్రిహ్మం వస్తాడయ్యా వస్తాడూ వీర య్యా తెస్తాడు తగవూలు తగద్రెంచ ముల్లోకమున కాదిమూల మైనగురుడు ॥వ॥ అల్లమా ప్రభురాయా డెల్లాలోకములే కల్లారి నరులాను గర్వమడచే గురుడు ॥వ॥ పెద్దాలదూషించె బుద్ధిమాలిన జనుల గద్దించిపల్లెలా గదిమిగుమ్మేవాడు ॥వ॥ పరమభక్తుల నెల్ల పరిపాలనా నేయా స్థిరముగవీరయ్యా గురుడు యీజగమేల ॥వ॥

### వీరబ్రిహ్మంగారి తత్వములు

వచ్చినాడు వీరబ్రిహ్మం ఓహో జనులార మీమ త్తాచి

మూలు మానిగురుని గోరుకొనరయ్యా ॥వ॥ మొదటి యుగధర్మ మునకు మొదటా యిదుగో విష్ణుదూతలు పుదయించేరు యింకా మనకు కొదువలేదయ్యా ॥వ॥ గోల్కొండ ఆవాని గుత్తిగండి కోటా కంచి కాలావశము లట్టూ బడుమూలను వివరయ్యా ॥వ కంసూరు దొరలుయింకా కారడవులు బడితిరిగేరయ్యా సందేహ మెందుకు కాలము సమకూడినాదీ వ॥ అంత సత్యాముదాయున్న ఇంతాలేదు అనేవారిని పంతగించి శివభక్తులు భక్షించిరయ్యా అ న్ని అనుకూలమాయెను అమకోరాదంట కొన్నిమాటలు కన్ను లాకు ॥పండువుగాను కనుపించరయ్యా ॥వ॥ తారకా శివ పోతు లూరు వీరబ్రహ్మణ్యుల నిపుడు కోరికొలచినవారికి నేరము లేదయ్యా ॥వచ్చి

ఓ వీరబ్రహ్మానందా యీశపరాకు మహేశ పరాకు యే మయ్యా ఏమయ్యా ఏమాయెనయ్యా ॥ఏ। ఏమని పలుకావు ఏమోనామనపి ఏమాయెనయ్యా ॥ఏమయ్యా తనువుతోడుత నన్ను పూలాకుపొమ్మాని నిండుసామాధిలో పండివున్నావా ॥ఏ। పండిన పనసాకు ప్రయాస పడ్డట్టు పరుసవేదిసోకి బంగారమైనట్టు కొండా వంటిది ఆశగొడుగువంటిది నీడనిస్తార్లుగా మనసునిండింప నే మంటావయ్యా ॥ఏ॥ గురుతుగాను సేవ గురునమ్మియుంటిని చెదర కుండాభక్తి శిధిలాముగాకుండా ముదురూ వెన్నెలచెట్ట ముక్తినై యుంటిని నాల్గు నడతలు చూచిన చోటాను నమ్మినానయ్యా యే మ॥ రాత్రి పగలను నిన్నేనమ్మియుంటి నాతోగలసిమాట్లాడని కా రణమేమోతలచుట్టుతిరిగినాతవికన్న వేరేదిక్కు తల్లిలేనిబిడ్డనైతిగ దయ్యా ।యేమయ్యా॥ చెప్పరానిపద్దు చేగూర్చరాదయ్యా యెప్ప డు గురుసేవ తప్పాగనేనుంటి నిప్పువంటి వీరప్పావాడ వయితె చప్పిడిగాకుండా చెప్పిపోరాదా ।యే॥ వీరబ్రహ్మ॥

## కాలజ్ఞాన తత్త్వములు,

### శ్రీ పోతులూరి వీరబ్రహ్మముగారి తత్వము

చెప్పెద గురుమహిమా తెలిసినంతట గురుని తెలుసుకొండి విప్పి చెప్పానునే నెంతటివాడ మన్ననతోనంటి వొప్పుకొండీ గుడిముందారా నొక గ్రుడ్డిముండున్నాది దొడ్డి మొండిదోవ కడ్డాముంది దానిఖండించి అఖండ పదవిలో కలుసుకొండి ॥చెప్పెద బూరుగా మ్రానిమీద రెండు పుట్టాలుగలవు తెలుసుకొండి ఆపుట్టలో రెండు పెనుపాములున్నావి పట్టుకొండి ॥చె॥ పుట్టుకున్నా వాంద్రపైని రెండుగుడ్లు తెలుసుకొండి ఆగ్రుడ్లమీద పెద్ద గూబ గూర్చున్నాది తెలుసుకొండి ఏడుకొండలనడుమా యెద్దుకూతా వేసినది తెలుసుకొండి ఆయెద్దుకూతావిని యముడు వద్దకురాడు తెలుసుకొండి మూడుమూలల పైనె మూతతీసే విధము దెలుసుకొండి మూతతీసితె పెద్ద భూతము లగుపడును దెలుసుకొండీ భూతాలనేమరి ఆ పరంజ్యోతి యొక్కటికలదూ తెలుసుకొండి ∙ ఆజ్యోతి వీరబ్రహ్మం శివపోతులూరయ్య తెలుసుకొండి ॥చెప్పెద॥

ఏమిటికంటా పనికిరాని దేమిటికంటా మనకుగానిదేమిటికంటా ఏమిటికంటా మరేమిలేదంటా పాముజేరిన యింటా పండుకొనే భయమంటా ॥ఏమి॥ ఆలున్నాదంట మగని కనుకూలము కాదంట ఆలుంటె నేనుంటే అతిమూర్ఖురాలంటెకాలుని దూతంట కష్టాపెట్టునంట ॥ఏమి॥ మగడున్నాండంట ఆలిమీద మమతలేదంట మగడుంటె నేమిటి మొగిలాకు సుఖమంట యెగదీస్తె ఈతంట దిగదీస్తె తెగదంట ॥ఏమి॥ కొడుకున్నాడంట కన్నవారి పిడికెడన్న మివ్వడంట కొడుకుంటె నేమికొనసాగని వాడంట కంటిలో యాగంబు కష్టపెట్టునింట॥ఏ॥ పాపిపాసిచే పంటపుష్కలముగాపండినదంటపాపిచెప్పినపంటసందితేనేమంటపాపచచ్చి

న కంటచూపేలేదంట ॥ఏ॥ పురహరుండట పేమిల్లపుర చెన్న
డంట పురహరుండట ముచికుందుడితడంట నోటబల్కని తుంట
నెనగోరు గాదంట ॥ఏమిటికి॥

## పోతులూరి వీరబ్రహ్మముగారి తత్వము

బ్రహ్మ మయమందురోరన్నా హర హరా శివశివా పోతు
లూరయ్యా ॥ పంచాక్షరీ మంత్ర పఠనచేయన్నా పఠనచేసితె య
ముడు పారిపోవన్నా పారిపోతే అంబ ఫల మిచ్చునన్నా
ఫలము అందేవాడు పరముతోయన్నా ॥ బ్ర ॥ ఆరునదులమీద
అంబ వుందన్నా ॥ అంబలో దుర్గాంబ ఆట్లాడునన్నా ఆట్లాడితే
అందు అర్ధముందన్నా అర్ధమెరిగినవాడు హరియతడోయన్నా ॥బ్ర
నాసికముపై చూపు నడిపించుమన్నా నడిపించి సద్గురుని నమ్మి
వుండన్నా పిలిచినప్పుడెనీవు నిలిచియుండన్నా నిలిచియుండి
ననాడు నిల శివుడౌయన్నా ॥ బ్ర ॥ మూడారువాకిళ్ళ మూతతే
యన్నా ముక్తివాకిటనిలచి తలుపుతీయన్నా తలుపుతీసితె అంబ
తాబల్కనన్నా తేజమందినవాడు తాశివుడోయన్నా ॥బ్ర॥ జం
టకోవులు రెండంటి వూదన్నా అట్టువూదిన వాము ఝంకించు
నన్నా ఝుంకెంచి ఘంటనాదించునన్నా అట్టి ఘంటధ్వనిల
జైమరవన్నా అట్టె మరచితె బట్టబయలు చూడన్నా బయలు
లో వీరగురు బ్రహ్మమోయన్నా ॥బ్ర॥

## యాగంటివారి తత్వములు.

ఇల్లు వాకిలినాది యిల్లాలునాదనుచు ఎలభ్రమసిలిపయ్యె
మనసా కాలునివలలోను కానకను చిక్కితివి కితతేయుతేత్రోప
మనసా ॥ఇ॥ తనయులూ చుట్టాలు తనవారు యనినమ్మితలపో
యకేవెర్రి మనసా తనువిడ్చి వెళ్ళేసమయంబులోపల తనవెంట
రారెరి మనసా ॥ ఇ ॥ ఆదిమూడిబతేరి లపతేజమాగని అంద

ముసుగనుగొనవె మనసా ॥ఇ॥ మేటిస్థానములోను మేటిస్థానము నందు సూటితప్పకచూడు మనసా వాటముగ బింబము తేటగా న గుపడును తెలివిగలిగి బ్రతుకుమనసా సత్తు చిత్తులరెంటి సారం బుగనుగొన్న జారవిడుచునేమొ మనసా ॥ఇ॥ సంసారివై నీవుదా రిని గనుగొన్న హింసలుతొలగునే మనసా ॥ఇ॥ రూపుచూపును లేని ఖేచరంబున జూచిదాపుజేరవె వెఱ్ఱిమనసా ॥ఇ॥ పాపను మే ల్కాంచిబయలు తెలుసుకొనిగోప్యముగనుండు మనసా ॥ఇ॥ అం టిఅంటనిపండు అరింటవెలుగుచును యింటిలోనున్నదే మనసా . ఒంటిగా యాగంటి వాసుని మదిలోన జంటబాయకనుండుమనసా

బ్రహ్మంగారి తత్వములు,

తియ్యనిమామిడిపండు పండుతినబోతె దొరుకాదు తీవుల పండు ॥తి॥ పండుకు వృక్షము ప్రజలెవ్వరెరుగారు పరమాత్ముడనె యాకుపైనుండగా పండుయెనుబదినాల్గు పర్వాములై యుండు ఒ రులాకు యీపండు వశముగాకుండు ॥తి॥ విత్తులేనిపండు విశ్వ ములోనుండు సత్యముమామాట నిత్యామయా అత్తగ తల్లికి ఆ బిడ్డ మగడైతే సత్యాము యీమాట నిత్యాముకనుడీ ॥తి॥ ఆలు మ గడూ రెండు ఆదిలేనివాడు కొడుకుకూతురు గన్న కొడుకేడిరా . అల్లునితల్లొక హరిహరాదులంటు ముల్లోకమున తల్లి ముగ్గురిని మ్రింగెరా ॥తి॥ చెరువులో దావానల జేటులయి పొయ్యేరు జనన మరణములేని జాతిపండూ వాదభేదములేని ఓంకారమయియుండు మాతల్లి మహమ్మాయి మర్మామీపండు ॥తి॥ వొరులాకు యీపం డు వొకదినుసుగానుండు వరులాను యీపండు నమ్మాకుండు ధర లోన యీపండు దాసులకై యుండు పరమగురు ధ్యానపరులకు పండు ॥తియ్యని॥

బ్రహ్మంగారి తత్వము

మూడుకాలాలు దాటలేరయ్యా యిలమూఢజనులు .

## కాలజ్ఞానతత్త్వములు.

మూడుకాల్వలు దాటలేరయ్యా మూడుకాల్వలతో గూడుక యి
డా పింగళ మధ్యమందున • జతగూడి పాడి సరస్వతిని విడనా
డి ఆవలమూఢులెల్లను వాడలేకను యీదబోయేరూ సంసార వా
రధి జాడతెలియక మునిగిపోయ్యేరు వేడుకతో హరినామము
నౌక ఓడజేసుక మూటిగడుపుచు ఏడుకొండలు దాటిపొయ్యే
డి వాడుయెవ్వడొ నూటికొక్కడు । మూడు॥ తన్ను తెలియక
యున్నవారితొ విన్న సుజ్ఞానమును దెలుపుచు కన్నులట్టె
మూసి జ్యోతిని కంటిమనుచు తల్లడము బలికె దున్నపోతుల
కేమి తెలుసును సన్మార్గమహిమ విన్నపురుషుల కేమిగల్గును
తన్నుదాతెలిసియున్న సంగతి వేమన్న శతకములోని భావము
కన్నగురువులచేతమరి తా విన్నపురుషుడు నూటికొక్కడు ।మూ।
గంగయమునా సరస్వతులు నుప్పొంగుచును సారంగనేరులు
తుంగభద్రా కృష్ణ కాశి గంగమొదలు నదులలోపల పొంగి
స్నానము సేయ పొయ్యేరూ పూరికె వట్టి జంగురాళ్ళకు పూజ
జేసేరూ సంగతిషడంగంబులు చెలగి ముద్రిక పట్టిగట్టిగ అం
గమున పరలింగమెరిగిన పుంగవుడు తానూటికొక్కడు ।మూ॥
బాధ గురువుల బోధవినుకొని పాదతీర్థప్రసాదములచే మోద
మొందుచు వేదవేత్తల మీదికిని కాలూచుచును మరి వాదు
లాడక యీదబొయ్యేరు ఏలాగుముందర పాదుకొని నేరస్తు
లయ్యేరు నాదమైయిడ గురుని చిదంబరు పాదములుగని ఆ
సపడి ప్రసాదములచే తృప్తుడైన వినోద పురుషుడు నూటి
కొక్కడు ॥మూ॥

### తత్త్వము.

దరిచేర్చ మీకరుణదయకు పాత్రుడనేను లక్ష్మిగోవిందా
నిరవిగాఓంకార వీధినడుమానున్న వివరించి చూచెదను గోవిందా

## కాలజ్ఞానతత్త్వములు.

సరియైన వేళలో సందుతిత్తులుమూసి ముందుచెప్పవె గోవిందా మందులకు శ్రీయమునా పండువెన్నెల బైటా తాండవంబాడెద గోవిందా ॥ద॥ గర్భమందునబుట్టి దుర్బుద్ధివాడవని దూషణంబేలా గోవిందా అద్భుతముగ నీవు నఖిలాన్డములతో నానిబ్బరమైన గోవిందా ॥ద॥ పాపాత్ముడను నేను నీపాదములు నేనెరుగ కోపమేటికి గోవిందా పాపలో రూపమై రూపుకాయమున దీనమై వెలుగు గోవిందా అండపిండాండ పృధివి ఆకాశమునునుండి యున్నావు గోవిందా బందెదొడ్డికితేలి పారిపోకుండనీవు బంధించి యున్న గోవిందా రెండువేలుదాటి కొండమీదనెయున్న రెండాకలైన గోవిందా దండమిదిగోనీకు దయజేసి రక్షించు అండజాపైన గోవిందా ॥ద॥ ఆరుచక్రములుదాటి మేటిశిఖరముచాల చిత్కళతో వెలుగు గోవిందా పాదుకొని వీరగురు పాలించు పార్వతిని పై నమ్మితిని గోవిందా దరిజేర్చు మీ కరుణ ॥ద॥

## శ్రీ ముక్తికాంత ఆత్మతత్వము.

శ్రీనివాసునిసేవ జేసే సిద్ధులెవ్వరె అక్కరో పూని సద్గురు సేవజేసే పుణ్యులెవరే చెల్లెలా గురుతుగా గురుసేవజేసెటి గురులెవ్వరె అక్కరో మరుజన్మములేని మహనీయులె చెల్లెలా మహనీయులనేవారి మతమేమొ అక్కరో ఇహములో మానాభిమానం విడివిందె చెల్లెలా మంచిదైతే వారికే ప్రాపంచ బాదేమక్కరో సంచితా మూలమందే సమసిపోవును చెల్లెలా ఎంచరానిసంచితాలవి యెట్లుబోవునే అక్కరో మంచిసద్గురుసేవచేకృశించి పోవునే చెల్లెలా దేవుడున్నతావుమాకు దెల్పగదవే అక్కరో నీవునీలో చూపచూడు నిండియుండెనె చెల్లెలా నిండియున్నతావుజేరే విల్కాడేవే అక్కరో దండిగా త్రికూటముపై దారిచూడే చెల్లెలా అందుపయి నిదారిజూపే ముదరియేదే అక్కరో....

## కాలజ్ఞానతత్త్వములు,

భద్రమైన శాంబవీ చిన్ముద్రగాదటే చెల్లెలా • శ్రీభద్రమైనముద్ర లో శశిభానుడేమే అక్కారో ముద్రభావముగాని ముక్తిమూల మేదో చెల్లెలా స్థిరముగా నాముక్తి దెల్పెసరసియేదో అక్కారో• ఆరుమూడు వీడగానే అబ్బునేమో చెల్లెలా మూడుమూడుమూడు వీడెమూలమెదే ఆక్కారో జోడుబాయుని హంసజేరే జాడగా దటె చెల్లెలా ఖ్యాతిగా భూమధ్యమందున జాతరేమో ఆక్కారో ? జాతరే ముమ్మూర్తులున్నా జ్యోతిరూపమె చెల్లెలా జ్యోతిలోనూ ముఖ్యమందే నాతియెవ్వరు అక్కారో నాతియెరిగి శాంభవీగురు మాటగాదటె చెల్లెలా ॥

### నాసరయ్యగారు చెప్పిన తత్వములు

ఏమందు నీపూర్వఫల విశేషము నేనెంతజెప్పిన వినవు మనసా సంతతము సద్గురుని సేవకర్త్వత కలిగి వర్తింపవే మనసా ఏ॥ ఏన్నాళ్లుబ్రతికేవు యేమిస్థిరమిది నీకుయేలతెలియదు మూఢ మనసా యమబాధలకు చాల యెటులోర్చెదవు నిన్నేమిచేయు దునే వో మనసా ॥యే॥ ఈ జన్మమున మోక్ష మేజన్మమునలేదు యిహమందు తెలియవే మనసా అకలంకమై గురు ఆస్పదంబున పరమాత్మ గలిగుండవేమనసా ॥ యే ॥ పరభామలనుజూచి పర ద్రవ్యములుగోరి పరులదూషింపకే మనుసా శరణాగత త్రాణ బిరుదుగలిగిన గురుని సేవచేయవె వెఱ్ఱిమనసా ॥యే॥ మద్గురువు నార్యుని మరువకెప్పుడునీవు మానసముననుండవె మనసా॥ తామ సంబులుమాని దరిజేరవే బాలదాసుగలిసియుండవె మనసా ॥ఏ॥

### నాసరయ్య చెప్పిన తత్వములు.

గురువుపదేశంబైనందుకు దుర్గుణములు మానిందెరుకా • మరువక సద్గురు మంత్రములోపల మర్మముదెలిసిందెరుకా ఎరుకా తారక బ్రహ్మము తనలోనుండెడిదారి తెలిసినదెరుకా • వారకాం

తలనుజూచి తల్లులుగావర్ణన జేసిందెరుకా మతభేధము సేయక తనలో మంకువదలినాదెరుకా రంకుజనులతో రాజ్యముసేయక రామునిదలవిందెరుకా ॥గు॥ ఇరువదియైదు తత్వముల లోపల హితవు దెలిసినా దెరుకా॥ మతములుకాదై వెలుగుచు నుండె మహత్మ్యము గన్నాదెరుకా ॥గు। మనోబుద్ధిచిత్తాహంకారములు మరచియుండినదెరుకా సరసత్వంబుగ సాధుజనులతో వాదులు సేయనిదెరుకా ॥గు॥ పాశబంధముల పట్టుబడక పరమాత్మనుగలసిందెరుకా వాసిగ దయతో అహోబల దాసుకు దెలిసిందెరుకా।

యాగంటి లక్ష్మప్పగారి యాలలు,

సూర్య సోమావహ్ని నడుమా శౌర్యమానె చిలుకా గంటిసూర్యాదీప్తి గాయుచుండగా ఓ యాగంటిలింగా ॥ చూడ చూడాశ్చర్యమాయెగా ॥సూ॥ కంటినిండా చూచుచుండా గంటి వుదయాది గిరిమీదను సాముజేసే సంజ్ఞ తెలిసితే ఓయాగంటి లింగా సారమైనా పుట్టాజేరూనూ ॥సూ। పాముపేరూ చెప్పా విష మూ ఆడ కాడ కెక్కేగదరా చీమయను పోతుకడుపూన ॥ ఓ యాగంటిలింగా । ధీరసమునా మ్రింగియుంటిరా॥ సూ ॥ ఆకాశాన కూనేకోడి చీకటిలో ప్రొద్దు పొడిచే చింతచేయు రాగధ్యానమూ ఓ యాగంటిలింగా యేకమైనా వెన్నెలగాయురా కాంత పాశెములోనా చింతమానుబుట్టె గదరా చింతాద్రియా కొనలు సాగగా ॥ ఓయాగంటిలింగా చింతాబూసి పండుపండెరా ॥సూ ॥ కానరాని అడవిలోనా వానలేక మడుగునిండే • వాన లేని మడుగు మీద ఓ యాగంటి లింగా • మానరాని అగ్ని పుట్టెరా। ఆకులేని అడవి లోనా తోకలేని మృగమూ బుట్టె తోకలేని మృగమూ కడుపూనా ॥ ఓ యాగంటిలింగా యీకలేని పక్షి

పుట్టెరా ॥ సూ। పృయ్యావాలే మేనభూతి పెయ్యావాలే రుద్రా
క్షలూ చెయ్యావాలే శివుని పూజలు ఓయాగంటిలింగా కొ
య్యావాలెరా కర్మబంధములు.

యాగంటివారి యాలలు.

సన్నంపుదిడ్డి వాకిట పున్నామా వెన్నెలబైటా కిన్నెరాల
నాదమింటిరా ॥స॥ వినగావినగవింతలాయెరా ॥స॥ ఎర్రామాను
వొడ్డుక్రిందా యెనిమిది వూడలున్నావి వూడావూడాయెంచి చూచి
తె ॥స॥ యుగముజగములందే యున్నావి ॥స॥ నల్లాగుంటా
నట్టనడుమా తెల్లదామర పువ్వున్నాది తెల్లదామర పువ్వులోపల
తెలియపరిచే దేవుడున్నాడు ॥స॥ ఆకాశానా కుంటనిండె కుండ
నిండ పంటపండె కుప్పకాలిఅప్పుతీరేనూ దీనిభావము నీకె తెలు
సూనా ॥స॥ దానిఅర్ధమేది తెలుపు పుడమి ధరణాలోనుండూ
ను తిండిపందాల కేమిదెలుసూను ॥స॥ వుట్టమీద చెట్టుబుట్టె
భూమిపైని తీగబారే కాసిలోను కాయకాయదా ॥ఓయా॥ పర్వ
తానా పండూపండెరా ॥స॥ కిందిపంట మీదిపంట రెండుపంటాలు
నలుపుకుంటా చచ్చుకుంటు పుట్టుచుండూను ॥ఓయా॥ వూరిబయ
ట చేరుకుంటాను ॥స॥ చిచ్చుకడుపూనా చీకాటిపుట్టె చీకాటి కడు
పూనా చిచ్చుబుట్టె చిచ్చుచీకాటేకమయితేను ॥వోయా॥ చిన్నె
లాడి బాలబుట్టెను ॥స॥ ఆలుకడుపున మగడుబుట్టె మగనికడుపు
న ఆలుబుట్టె ఆలుమగడు కూటమయితేనూ ॥ఓయా॥ అమృతకళ
లు చాలబుట్టెను ॥స॥ పాతికట్ట నూతిలోని పండు మఱ్ఱిచెట్టుబుట్టె
ను పండుమఱ్ఱి డోరాపండాయె ॥ఓ పంచవన్నెలచిలుక బుట్టెరా
॥స॥ మమ్మూలకోలలు మంచికమ్మ తేనెపెరుగుండగ నమ్మికతో

తాటిచర్ల చలమయ్యగారుచెప్పిన యాలలు.

రూపురేఖా లేనివాడు రేపుమాపు లేనిచోట కాపురమే శూన్యం సున్నంట ఓషడ్భావలింగ చూపుమన్న చిన్నదాయెరా ॥రూ॥ చిన్నదాని కంటిలోను యెన్న మఱ్ఱిచెట్టున్నాది యెన్నమ ఱ్ఱిచెట్టు మీదను ఓ షడ్భావలింగా అన్నిదిక్కుల నధికమాయెరా ॥రూ॥ ముజ్జగమ్ములు నుదయమాయె ముజ్జగంబు లుదయాషంత మమ్మూర్తులూ భావమైనది ॥ఓష॥ ముదిత మొసలిముండ ఈ నె రా ॥రూ॥ గొడ్డుముండా కడుపునందు దొడ్డవాడు కొడుకుబుట్టె కొడుకు జగము విన గూసేరా ॥ఓష॥ జడియక నాదాము వింటిర ॥ రూ॥ నాదాపోషానవనమునందు దోమారెండు గజముమ్రింగె ఆదిజ్ఞానా యోగామంచె యుండెరా ॥ఓష॥ ఉదయాద్రిలోవుండి చూచితి ॥రూ॥ సతతామూ సహస్రకమలా ఉదయమేరు శిఖరమునా కదలి తా డి చ ర్ల ఘనుడయిన ॥ ఓష ॥ కనిమీరా ప్రభువు గంటిరా ॥ఓ॥

మంగళ హారతి.

మంగళము అకార మంగళము సాకార మంగళము ఓం కార మణికుందకూ మంగళఘోవీర మమగన్న తండ్రికి ।మం గళము గోవిందమ్మజననికి జయ మంగళం సదాశివమంగళం పుట్టితిరి భువిలోన దిట్టముగ వెలసితిరి గట్టిగా గురుసేవ గుట్టు తోనా దిట్టముగా గురువీర దివ్యతేజంబైన అట్టి పోతులూరు కి య్యరమ్మా ।జయ। వస్తిరే శిష్యులకు వైకుంఠమునసుండి యి స్తిరా భక్తులకు యిహపరములు కాస్తిరో పుత్రులకు కరుణతో ధరియించి పూస్తిపూరీ నెరిచుట్టుకుంద ॥జయ॥ హారతిత్తురుమీకు హరిహరాదులు మొదలు పురహరుని దయతోను పుణ్యచరితా , వన్నుగా వైకుంఠ భానుతేజము తెచ్చి యి ...రమ్మావీరిశౌరికిపడు

॥జ॥ ధారకును మాతకును వారికిని మంగళం భూలోకమాతకు పుణ్యవతికి హేతుభూతంబైన హేతువులు చదివేటి హేమించుటకు వీరవామాక్షికి ॥జ॥ ఒరులకును నరులకును హరికియ్యారతి పరగ వీరబ్రహ్మపరమేశునకు వరవీర గురుకరుణ వైకుంఠమున నున్న వీరగోవిందమ్మ కెపుడియ్యరమ్మ ॥జ॥

ఈశ్వరుని మంగళహారతి.

శ్రీమహాదేవునకు చిన్మయాకారునకు అమితరూపము విరూపాక్షునకునూ అమృతబిందూ కళంకాది మధ్యాంతరహితునకు విమలమగు పరిపూర్ణ ఈశ్వరునకు జయ అష్ట దళకములునకు నాద్యంతరహితునకు సృష్టి ఈ భూమధ్య చక్షునకును దృష్టినను బయటనూ దివ్యలింగంబునకు సృష్టిపాలనజేయు శ్రీగురునకు । జ అండయగు పరమాణు యమృత పురుషునకు మండలాకృతియగు మహనీయునకు నిండియుండినసత్య నిర్వికారరూపునకు ఖండయం ఖండమౌ ఘనయాత్మకూ ।జ। తాలుమూలల గట్టి భ్రమ గల్గియున్నట్టి నీలవిద్యు శ్రీశైలనిలయునకును శ్రీలుమించిన తాడిచర్ల శ్రీ శేషగురు ఫాలలోచనుడైన పరమాత్మునకు ।జ।

శివసదానంద చిన్మయవిద్రూప శ్రీ వీరబ్రహ్మ రావయ్యా శివభక్తుగూడి శివపూజజేసేరూ శివరాత్రినేడు రావయ్యా । తెల్లవారవచ్చెను ఐదునూరేళ్ళాయె ఆ రూఢిలోనుండ అది బ్రహ్మాండమూర్తి బ్రహ్మాండనాయకా ॥రా॥ శివపోతులూరయ్య శివపూజజేసేరూ శివరాత్రినేడు రావయ్యా ॥ ప్రవిమలానంద పరిపూర్ణ వాసుడా బ్రహ్మస్వరూపా రావయ్యా వీరబ్రహ్మమూర్తి వేదాంత వైద్యుడ వీరనారాయణ రావయ్యా యెందుజూచిన యానందమయి యున్నావు బృందారక తరణా ॥రావ॥ సిద్ధులందరూ మిము సేవింపవచ్చిరి చిత్తాసదానంద ॥ రావ ॥ భావము లోవల పూజిం

తుర. మిమ్ముపరమశివమూర్తి రావ॥ కందిమల్లయ్య పల్లెలో వెలసిన ఘనసిద్ధమూర్తి ॥రా। సుజ్ఞానవంతులు సురులు మునులు మిమ్ముచూడవస్తున్నారు. రావయ్యా పగలు రాత్రిలేక పరమయి వున్నావు భక్తవత్సలముక్త ॥రా॥ లక్షరూఢిలోన రవిసహస్రము నందు సాక్షియైయున్నావు ॥ రావ ॥ పంచభూతములను పంచాన పడవేసి మించియున్నావు. ॥రావ॥ ఈరీతిమిమ్ముగొలిచెద ఆనంద భయమున నఖిలాండమూర్తి రావయ్యా రాజయోగమునందు రంజిల్లుచున్నావు రాజశేఖరమూర్తి ॥ రావ ॥ విశ్వవంతుడవైన వీరబ్రహ్మమూర్తి వీర మహేశ్వర ।రావ॥ సమాధిలోనాను సాక్షి జ్యోతిపైన సర్వమందున్నావు ॥ రావ ॥ ఏవేళానీపాదపూజలు చేసెద యోగిసదానంద ॥రావయ్యా॥ సదయ హృదయాన సాక్షి వైయున్నావు సచ్చిదానంద ॥రావయ్యా॥

శ్రీ ర స్తు.

శ్రీగురు పోతులూరు వీరబ్రహ్మంగారికి.

చ। పరమమునీంద్ర హృత్కమల భాసిత యొక్కటివిన్న వించెదన్ పరసులు దీనిభావము ప్రసన్నమతిన్ వివరింపవయ్య నిం దతకు సనాది జాగ్రతకు దోచిన అంత్యము యేది కర్ధయో పరమరహస్య సమ్మతము పల్కినవారికి నేను మ్రొక్కెదన్॥

పోతులూరి వీరబ్రహ్మంగారి వచనము.

ఇంతబలమిటు స్థలముయెవ్వరికి అలవియగును సంతత శివపదధ్యానులకే కాక ఏడుచుట్టులకోట ఏకచక్రాధీశమాయయని తెలియకను మగువగూడి చూడచూడగ రవి సోమవీధుల గలవు పండువెన్నెల కాంతి నిండిన గురుడు నలుగురు మంత్రులు నాయకులు ఏడుగురు కరణాలు ఆర్గురు ఘనముగాను నలువది యెనిమిదివదులు శ్రుతులు జెప్పెటివారు ముప్పైఅయిదుగురు

ముసద్దీలుగలరు ॥౩॥ యెనిమిదిమదకరులు ఏడువేలరథాలు పద హారు లొట్టిపిటల్ బారుగొలువగను ఏనూరు అశ్వములు ఏవేళ కొలువగను యేడు డెబ్బది రెండువేల కాల్బలములు ।౩౮। పదియైదుగురుమాయా భటులు సామంతులు పదినూరు తలవరుల్ ప్రహరి దిరుగగను ప్రణవభేరిమృదంగ పంచమధ్వనులచే పగలు రేయును మహా ప్రతిభ ఘోషిల్ల ॥౩॥ పశ్చిమద్వారంబు పద్మరాగపుకాంతి పదినూరు స్తంబాల భారిమండపము పరమనరవై లింగ భావసిద్ధేశ్వరము ప్రతినిష్ఠ పో తు లూ రి శుభకల్యాణ గృహము ॥౩౦॥

బ్రహ్మంగారి గోవిందపదములు.

నడివీధినాముందు నాటింతురా కొల్మి నడిమండలమందు సాటింతురా నాసంది తెలియనట్టి బద్ధెకుక్కలబట్టి బంధించి బాకూలకమ్మింతురా శివగోవిందా ఏడుతిత్తులుబట్టి పూరింతురా నేను మండలంబున మింట భేదంతురా దండైననాగురుని అండ జేరుక పెద్దా కొండలన్నియు పిండికొట్టింతురా ॥శివ॥ కోప మానె బొగ్గుల్ కొల్మిలో బోయించి పాపమానెయినుము బెట్టి తిరా చాపవంటి అగ్నిచూపులో వెలిగించి దీపమంటిజ్యోతి పట్టితిరా ॥ శివ॥ గోవిం॥ నాలుగుసంధులునాటింతురా శివనామ ధారునిబట్టి సాధింతురా । నాణెమెరుగని జనుల భూమిపాలుచేసి భావముందర నాటనాడింతురా ।శివగోవిందా॥ అరుమతములాకు అరెండునాకొల్మి ఏడులోకములాకు వెలుగు ముందు వాడలో నాకొల్మి జాడతెలిసియుండే నీడలేనిచోట నిలిచితిరా । శివగోవిం దా మతము తెలియునట్టి మాయాగుంపునుబట్టి మానుమానుకు ఏలగట్టింతురా నాడు పోతులూరి వీరవాక్యము వామాట మాగి వాడలనోలలాడింతురా శివగోవిందా మూడు మొనల

## కా ల జ్ఞా న త త్త్వ ము లు.

మీద ఆడింతురా లోకంముగ్గురు మూర్తులాడింతురా ఖేదాము సేయకా హరిపోతులూరయ్యా ॥ వాదాముబట్టినే బల్కితిరా ॥ శివగోవిందా। ముప్పైరెండు బిరుదులందితిరా నేను మూల పైనా చోటు చెందితిరా కాలయముని బొమ్మకట్టె చెంగున దాటి నోలలాడే బ్రహ్మాపంశమురా ॥ శివగోవిందా॥ నాకొలిమి కాకాలా కాకొనిలోకము మూకాలవలెతిరిగి కూకాచేసుకొని పోతులూరు భీకారమునెత్తి కాకులమీదికి కదలింతురా ॥శివగోవిందా॥

పోతులూరి వీరబ్రహ్మంగారికి శిష్యుడు
దూదేకుల సిద్దప్పగారి తత్వము

అనుభవింపతీరదితడెంతటివాడైనన్ ॥ శివా తన ప్రాప్తి యున్నకగా దీనికొకటిలేదు. హరిశ్చంద్ర మహారాజు ఆలినమ్మగ లేదా నలుడుజలము లేక నలిగుమ్మలేదా పరీక్షిన్మహారాజు పాముకాటుపడలేదా హరికిరాతకు చేతులు యేటుపడలేదా ॥ అను॥ ధాతకును వ్రాతకును వ్రాతలకొట్టుపడలేదా భూతపతి భిక్షుడై భువి తిరుగలేదా మనులెల్ల మోహముల మునిగితేలగ లేదా దిననాధునిరాహు దిగమ్రింగలేదా ॥అను॥ గుణహీనుడై శశియు గురుశాపమున పోలేదా అతిభయంబున వానరేంద్రు జజలంలేదా ॥మది॥ తప్పిభీష్ముండు మరణమొందగలేదా తను శివాసిద్ధగలిగుండలేదా ॥అను॥

ఏల యీదేహము పనికిరానిదెందుకీమోహము జ్వాల మనెసంసార బంధములోనచిక్కి మూలమెఱుగని ॥ఏ। మూలు బెనుగుచు ముమ్మూలాము చోటులెరిగియా జనులమూటి మూటగడచి ముక్తిపతిని అండజేరి మోడివేసెడి కోడెపామును వేడుకతో ఆడించనేరని ॥ఏ॥ పంచేంద్రియములను శోధించియు

త్రుంచివయ్యలేకను చంచలము శోధించిమించి ప్రాకుమంచిదవు గా మంచివాడగురుని వంచనపొంచి ఆలించనేరని ॥ఏ॥ అష్టమ దములానుయెల్లప్పుడూ దృష్టి తెలియలేకను కష్టపడక యిష్ట మగుచు నిష్టలన్ని సష్టమగుచు సృష్టిలోపల దివ్యలింగము విష్ట తో చూడంగలేకను ॥ఏ॥ వాడలోపలను ఏడింటిలో జోడుగూడు కొని కోటి సూర్య కాంతి వెలుగు నాటకుల నెర నమ్మి కాటుకాపక్షులరెంటనిభయపెట్టె క్రమము తెలియనేరని ॥ ఏమి ॥ జాలమెరుగాకను మానాభిమానములోన బొరలుచును కాచినరాసి కొనజొచ్చి బోనగురిసిమేను మంచిదాను తానై సిద్ధలింగంతలచి చిన్మయ మందనేరని ॥ ఏ ॥

నన్నుకులమడిగేది న్యాయమా తమకు కానికులమేలేదు ఘనుడు తానౌను నాదుబిందుకళ నాజెమౌనాకులము వేదాంత రహస్యమున వెలసిన కులము దశవిదం అవునాదు ధరణిలో నా కులము పిపీలికాది బ్రహ్మ పీఠమౌకులమూ ॥ న ॥ కనుజీవుల యందు కారణంబౌకులమూ కల్పవృక్షరీతి వెలసిందికులమూ ఏ దేశు పవనములేకమైన దీకులమూ ప్రకటితముగ కులము ప్రణ వంబు కులము ॥న॥ జీవకోట్లకై జీవమౌనాకులము దేవుడే దేవు డని తెలిపేదనాకులము తెలియని వారలకు తెలిపేటి గురు కుల ము తెలిసి తెలియక సిద్ధమగు కారణమే నా కులము ॥న॥

యాగంటి లక్ష్మప్పగారి వచనము.

జీవుడు తనలో దండిగ వుండగ తెలియదాయె మానవ పశువులకు సంశయముడుగక సద్గతిమేరకు సర్వము తానని తెలి యవలెన్ సర్వముతానని తెలిసేటందుకు గురుపుపదేశం కలుగ వలెన్ గురుపుపదేశం కలిగేటందుకు నిలకడగా మది నిలువ వలెన్ నిలకడగా మది నిలిపేటందుకు విరసము విడువక

# కాలజ్ఞానతత్త్వములు.

తెలియవలెన్ విరసము విడిచితె నిండు సమాధిలో నున్నత
ముగ తానుండవలెన్ సున్నతముగ తానుండేటందుకు తారక
మున గురితముగనవలెన్ తారకమున గురితగిలేటందుకు ఉచ్ఛ్వా
సంబులు నిలుపవలెన్ ఉచ్ఛ్వాసంబులు నిలిపేటందుకు సాధక
మును సాధించవలెన్ సాధకమును సాధించేటందుకు యేమరక
పరిశోధించవలెన్ ఏమరకపరిశోధించేటందుకు ఏకాంతంబున చేగ
వలెణా ఏకాంతంబున చేరేటందుకు దేవుని కృపతా కలుగవలెన్
దేవుని కృపతా కలిగేటందుకు నెఱుక గలిగి తానుండవలెన్ నెరు
క గలిగితే యాగంటీశుని మరుగునజేరక నుండవలెన్ మరుగు
జేసుకొని మరియానందము మహిలో పొందుచునుండవలెన్ ॥జీ॥

గుణము కుదరగలందులకు వచనము

గుణమూ కుదురాదూ యేమిసేతు శ్రీరామయ్యా గుణ
ముకుదురాదూ యేమిసేతు గుణముకుదురనిశునకమువలె దుర్గుణ
ములదిరుగుచు కుదురుగ నిల్వను ।గుణ। పరద్రవ్యమురా పట్టె
నంటది పరభామలనెడ బాయనంటది పరభోజనమునకు పైనం
బంటది పరనిందకు నేబంటునంటది పొరుగిండ్లకు నేబోతనంటది
తిరిగిజగడములు తెస్తానంటది వరుసదప్పనను పగవలెనంటది
నిరశనదేహం నిత్యంబంటవి గురుతుగ స్వామిని మరువకుమంటే
కుయ్యబోకు నేకొరగానంటది చంచలమతి చెల్లింపనంటదీకొంచపు
నరులకు గొలిచేనంటది పరోపకారము చెయ్యనంటదీ పంచలబడి
యాచించెనంటది మించిపగలుసాధించెనంటది అంచిత భవమార్జించె
నంటదీ అంచితముగ శ్రీ హరి యనుమంటే మించినన్ను
బెదరించుకునటంది ॥గుణమూ॥ చెప్పుడుమాటలు చెవి గొర
వింటది తప్పుడు పనులు తగినట్టంటది తప్పిదములునే తప్ప

టది తప్పిదములు నే తప్పనంటది తప్పునడవడిక నొప్పెద నంటది ముప్పగతిండికి మురిసేనంటవి యెప్పుడుహరికధ తప్పక వినుమని చెప్పితె నేనది వొప్పనంటది జేసెరుగని పనిచేసె నంటదీ ॥ అంటనిపని కొరాటంబంటది బూటకములు నాపుట్టిల్లం టది మోటుతనము బహుమగతనమంటది ॥ తాటకి తనమున తగినట్టంటది మటిముడివేసితే ఘనమనటంటది ॥ బాటతిప్ప పర బాటయటంటది । దాటిగహంసల నాటకుందని మాటనావెవుల నాటనంటది ॥గుణము॥

ఉదరపోషణ కొరకై వేషములన్ని ఉదరపోషణకొరకై యొగగి భక్తి కుందారవదనుడైన పాండురంగని వేడింద ॥ఉద ర పోషణా॥ త్రేతాయుగంబున దేవతలందరు కోతులై రాముని కొలువు కొలిచినదెల్ల నలుడుదమయంతిని నట్టడవిలో విడిచి పొరయా ఋతుపర్ణుని పొంతజేరినదెల్ల ॥ఉద॥ దొడ్డరూపము మాని జంటయైవిరటునియింటిలో భీముడు వంటాల వండింది ॥ఉ గురువులమని శిష్యవరుల బోధించుచు పెరుమాళ్ళతళిగకు త్వరగ దెప్మనుశెల్ల ।ఉద॥ దున్నేదిదోకేది దొరలగాచేధి పన్నుల మి క్కిలిబెట్టిపంటపండించేది ॥ఉ। పాండవులడవులపడిగాంధారేయుల ఖండనముసగూల్చి మండలపతులైన ॥ఉ॥ వేదశాస్త్రపురాణావిద్య లు నేర్చి వినోదముగల సభల నడుమనుతిరిగేది ।ఉ॥ సలలితా మంత్రానుష్టానము లొనరించి బలియుడై భూరిరక్షలు గట్టవచ్చును ॥ఉ। ధరణిలో శ్రీ వెంకటేశ్వర్లు దలచినదేసిరిసంపదలిచ్చు అలి వేలుమంగమ్మ ।ఉదర॥

బుద్ధిమంతులైనవారికి నిజము నిలకడమీద తెలియును.

ఇది నిశ్చయమని పెద్దలు చెప్పుదురు.

పోతులూరు వీరబ్రహ్మంగారి వచనములు-సంపూర్ణము.

శ్రీ గురుభ్యోనమః
శ్రీ గురు అల్లాడిపల్లె వీరభద్రాయ నమః

# యాగంటి లక్ష్మప్పగారి తత్త్వములు.

పరమవీరాచార్యులు అయ్యగారు నిత్యసేవానిరతులు ఆడి తప్పనివారు పలికిబొంకనివారు శివపూజాధురంధరులు సత్యవ్రతులని పెద్దలు నిశ్చయించిరి

తత్వము; ఫాలలోచనవిన్నపంబూనిన్ను యేలీలపూజించు విధము నేనెరుగ శ్రీమన్మహాదేవ శివభక్తమందార శశిజూటేశ వామాంక గిరిజాధ రాకామసంహార కూబ త్రైలోక్యనాధ గీర్వాణా ॥పా॥ నామజాసన జనకసకల భువనాధారశరణాగత దీనరక్షకా నామనవి చేకొనవె నందివాహనరూఢ నాగభూషణలోల యమిత గుణాహారా ॥పా॥ మధుజలంబులనిన్ను మజ్జనము చేసెదనంటె మత్స్యముల యెంగిలోదేవా తుద ముట్టకుసుమములతొడరి పూజింపగా తుమ్మెదలయెంగిలోదేవా పదిలముగ నావు పాలర్పించెదనంటె పసిలేగ యెంగిలోదేవా మదిలోపల శివచింత జేసెదనంటె మనసులో నొకయింత మర్మమెరుగ ॥పా॥ అంగనామణులగూడి యవగుణంబులెకాని ప్రారవిన్ను మదిలోన దలచనేనెరుగా లింగసంగులగూడి లీసమైయొకనాడు జంగమార్చనచేయనేనెరుగా వెంగలురతోగూడి వృధచదువు లేకాని సంగతైనచదువు నేనెరుగా గంగాధరానిన్ను మటి మదిలోన దలచేటి ఘనమైన యిహపరాక్రమము నెరుగా॥ పా॥ పదివేలహింసలుచేసి యినుపకత్తి పరుసంబుసోకినను దేవా పదియారువన్నెల పసిమిగల అపరంజి బంగారుగాకుండునే దేవా కొదువమెవ్వరిదన్న యినుముతో పరుసంబు హోరాగమనగం

## కాలజ్ఞాన తత్త్వములు.

భీరా చదువుల ధ్యానాత్మ శివచింత నొందెదవంటే దనలగా విడి దుడిరి కొరువనీకగునా ॥ధా॥ నిన్ను మెప్పించగ నేనెంతవాడను నిగమగోచరభానుతేజా నిన్ను నమ్మినయట్టి నీముద్రి ధారికి నీ నిజము సత్కృప జూపవలదా యెన్నగల అవగుణములెన్ని గల్గినగాని నన్నరయ పనిలేదు. నాకన్న తండ్రి గుణములెన్నంగ పనిలేదు. యాగంటి ఘనుడు సంజయదేవఘనతప్రభావా॥

### తత్త్వము.

ఎన్నెన్ని జన్మములయందు బుట్టితినొ యిన్నిటిలో చేయ కిపుడు నీ కృపయంచు విన్నవించెదనయ్యా నిజమహాదేవా యెన్నగలనవగుణము లెంచెదరు యికనిపుడు నన్నరయ పని లేదు నాకన్న తండ్రి ॥యె॥ పంచమహాపాతకముల పట్టిపారగదోలు పంచాక్షరీమంత్రప్రాణమహిమా నెంచుకొందురు చాల నెల్ల సుర మునీవరులు పంచముఖఫాలాక్ష పంచశరశిక్షా ॥యె॥ పరుసంబు సోకి యినుము బంగారమైనక్రియ హర్షమున నీవిపుడు అతికరుణ నూ పరమేశయాగంటి పార్వతీ హృదయేశ ఇరవొంద నన్నేలు మిహపరం బొసగూ ॥యె॥ యెన్నగల నవగుణములెంచెదరె నిక యిపుడు నన్నరయపనిలేదు నాకన్నతండ్రి ॥యె॥

తత్త్వము ఏటి శిలావ్రతం బేమి సుఖమూ మాటల నిజముగ జిహ్వామదినుంచగవలదాయతనియవగుణములకు జిహ్వా బుట్టినయట్లు మదిగోర్కెలుడిగి నెమ్మదినుండవలదా ॥యే॥ ప్రవి మలంబైన పాపవర్జితమట్ల వివరింపబొంకులు వటివిడువవలదా ఋషిజూడరాదనుచు భావముననున్నట్ల నవిశేషముగ పరసతి కుండ వలదా కొఱలేక గతివేటచే కొల్లలాడినయట్లు గరిమలింగము మీద బరిగొనగవలదా ॥ యే। రోసిపులమూత్రముల లోన బుట్టిన యట్లు ఆశపరద్రివ్యములకట్లుండవలదా॥

కానుమీదను వాంఛకలిగినట్లె యిట్టు యీశుమీదను ధ్యాన మట్లుండపలదా ॥యే॥

తత్వము

కలదె జీవన్ముక్తి కర్మాంతరంగునకు తలపశివయోగి సంధానునకెకాక తనువు ప్రాణముమనసు తగనేకముగచేసి తనువు లోపలనున్న దైవమెఱిగి తనువుగోరికలణచు తత్వసంధానము దినముశివునిదలచేటి ధీరులకెకాక పరగ శడ్గళకమల భావంబు కీలెఱిగి అరసిబిందూర్ధ్వమంబమరజేసి శిరమునవెలిగేటి చంద్రమండలసోమ కరమర్ధినర్చించు ఘనులకేగాక సలలితంబుగ హృదయ శరసీ రుహంబులలోపలబల్కు ప్రణవసంధానమునను తెలిసి యాగంటిగురుదేవునిమదిలోనకలసివర్తించేటిఘనులకేగాక ॥కల

తత్వము:-పోయేకాలము వృధాపోకనా జనులారా ॥ యేయుపాయమునమీరు శివునెరుగుదురు ॥పో॥ కలిమిలేములచేత ఘనలోభములచేత కలహముచేత సహకారంబుచేత కులమదంబులచేత కూహకంబులచేత చలముచేతను కుబుస సుఖంబు చేత ॥ పో ॥ వట్టియాశలచేత వైభవంబులచేత పట్టుపసలేని దుర్భామినులచేత చుట్టపోవులజేత సుఖదుఃఖములచేత గట్టియిన మోహాంధకారంబుచేత ॥పో॥ బంధుబలములచేత బహుబలంబులచేత బలువైన సంసారబంధంబుచేత తలపయాగంటి గురుతత్త్వయుక్తముచేత తెలియంగరేని సందేహంబుచేత పో॥

తత్వము:- ఇదిగో భవరోగములకిల నౌషధంబు ప్రవిమలంబైన శివభక్తులకు నెల్లన్ శరణు సంగమపూర్ణ చంద్రోదయము లింగపరవశమే ఆనంద భైరవంబు చరమూర్తిపదసేవ సంజీవమేదనము సద్గురు నాదమె జ్వరాంకుశంబు ॥ఇ॥ కమనీయ రుద్రాక్ష కనక సింధూరంబు అమితభసితాగ్నికుమారకంబు

విమలమైన వ్రతము లేరవిక్రమరసము రమణ పంచాక్షరిరస భూతియు ॥ఇ॥ నవతి దాసోహ నిశ్చలము చింతామణి అతిసీర శైవమే యత్రభం కష్టంబు మదిలోమ గురునీతియు మండూర యాగంటి పతిశంభుసేవయు పరమాద్భుతంబు ॥ఇ॥

తత్త్వ ము:- కలిత చిన్మయనేత్ర కమల మధ్యమునందు నిర్మలసోమ సూర్యాగ్నిమండలమునన్ • అలరు తన్మధ్య పర మాణు సూక్ష్మము ద్వారకమల జగములకు ప్రకాశించె గదా అనుదినము పరమకళయై విశ్వమంతయు ప్రకాశించు ఘనతేజ మున నిష్టలింగము తానెకాదా అదిగదానిల తోయమధ్యమున కళా అదియు విద్యుల్లేఖయన నమరియుండున్ అదియు నీరవా శూకాగ్ర సూక్ష్మంబనెడియుదిత మాపోజ్యోతి ఓంకారమనగన్ తలపోయ విశ్వతః చక్షురుత మవగ కలయ విశ్వంబెల్ల కన్నన కనవలెన్ తెలిసి యిందులోన తేజ ప్రకాశమై చెలగి యాగంటి గురు శివుడుతా గాదా ॥క॥

తత్త్వ ము:- పరమ పావనమైన గురుకర పద్మశిర సం యోగ భావరిభరి చిత్కళసంభవములందును నిరతముగ సత్కాం తి నిర్మల తర మహాను ఘనదివ్యలింగము కరతలామలకముగ కానబడియెడు భాగ్యము నాకెన్నడెన్నడుగలుగునో ఘననిరంతర సావధానము సన్నుతముగ సత్క్రియోన్నత సారమగుపనంగా సంగమెన్నడెన్నడు గలుగునో యీ ఘననిరంతర సావధానము ॥ప॥ జ్ఞానగమ్యంబైన నిత్యసుఖానుకూలత బొరలుచుండెడుసమా న లింగ నిరీక్షసంధానియైయుండి పూని భాహ్యాభ్యంతరములతోను వెలిగెడు సత్ప్రకాశ శివానుభవమానందము మదినిదలపకుండెడు భాగ్యమది నాకెన్నడెన్నడు కలుగునో యీ ఘననిరంతర సావ ధానము ॥ప॥ యెఱిగి యెరుగని యెరుకగొని

## కాలజ్ఞానతత్త్వములు.

తెరవెరింగియు వరలు నిశ్చల భావరతి సర్వాత్మల నుపొంగి యెరుక మరపులేటికి యెడతెరపి లేని సకలంబునందు యాగంటి నందీశు గలనెడి భాగ్యంబు నాకెన్నడు గలుగునో ఈఘన నిరంతర సావధానము సన్నుతంబగు ॥పరమ॥

తత్త్వము:- తెలిపి అతిశయమంత్ర దేహమేనైతె కలిగించు ఘనగుణ వికారి కాగానేలా నంపు శివలింగాంగ॥ సహితంబైతె బెలుమోహసంసార బంధమడియేల భావింప నీముప్రబలువు ననుటేకాని అవిరళ భక్తి నాకలవియా దేవ ॥తె॥ అనఘ త్రివిధ ప్రసాదాహ్లాదియై యున్న మును పంచవిషయ గుణముల బొందనేలా ఘనత సుజానంబు గురుకరుణతో వడసి ననుదిప సమానరీతుల దేహిగానేల ॥తె॥ అతులపంచాక్షరీమృత సేవకుండైన సతత ప్రపంచ వాగ్జాలమ యేలాయితబుద్ధి యాగంటి యీశ మిముదలచిన కుతుకత్రివర్గగుణము లవియేలా భావింప ॥

తత్త్వము॥ పూనియిష్టలింగమూర్తి పూజసేయుప్రేమ దృష్టి • మాని ఆనంద జలధి నోలలాడుచుండగా • నేనుబల్కా తొడరి నిపుడు ప్రాణమయినని ఘనిజాని • లీనమై సుఖమెరుంగ లేనివాడనైతిగా॥ పూ॥ ఏటి పూజయేటి భక్తి యేటితలపు భావలింగ కూట మయినచో పెరింగి కూడనేనైతికా యెరుకలెల్ల ప్రాణనాధు యెరిగిపాయ లేనిభక్తి యెరుకమరపు లేక భజన యెరుగ నేరనైతిగా॥ మరపు లేనియెరుకలింగ మందుగీదు కొలిపి నన్ను యెఱుక లేనిమఱచుమోహ మెఱుగ నేరనైతిగా ॥ పూ॥ తలచినంత యాత్మలోన వెలుగుదివ్య లింగమూర్తి కెలమిప్రాణపదంబైన నెరవు నేరనయితికా అలరు చిన్మయ ప్రకాశుడైన యాగంటిగురునికలియపూర్ణ భావలిధినిగలయనేరనయితిగా యేటి పూజ యేటిభక్తి తలుపు భావలింగ కూటమైనచో పెరింగి

కూడనెటనై తిగా ।

తత్త్వము॥ అలరు బహురంధ్రములైనమాఘటము లో పలనున్న దీపంబు ప్రభవెలయునట్లున్ నిలచి ఇంద్రియద్వార ని కర విమకాంగమున వెలుగు ఘనలింగనజ్యోతి అదియు తాగాదా కలయ పర్యాంకాలింగ ప్రకాశంబై వెలయునింద్రియములు శివేంద్రియములాయన్ । అలమెరసి బ్రహ్మాండమున మించి సూర్యుడు తన కిరణములచేత తన్నెరింగించునట్లు అరయపిండాం డ తన్మధ్యాంతరంబున చిత్కిరణముల తన్నెరుగుటేకాదా ।అల॥ తననినకలంక ముఖదర్పణంబున జూడ యెనసితనముఖము తానని తెలియునట్లు తనదు నిర్మలబుద్ధి తానెన్వయలింగ మనిక నుట యాగంటి గురుదతడెజూడరా కలయసర్వాంగ లింగ ప్ర కాశంబై వెలయునింద్రియములు శివేంద్రియములాయెన్॥

తత్త్వము:— ఇనుము పరుసమునోకి కనకంబుయాగా కనకంబయినుముతా గానియట్లుగా అనలంబునోకి ఘృతమౌను నవనీతంబు వెనుకతిరుగా ఘృతము వెన్నకానట్టున్ మునులింగ ధారియై ఘనచతుర్విదపదవి ఘనజతుడై కర్మగారాదు మంటిచే కడవయై మరియగ్నితోకాల్చి అంటెదవు దీమంటగలయనట్లున్ స్వాతివర్షము చిప్పనంటి ముత్యంబౌను కంటిరే ముత్యంబె వుదకమవునా అమరపీటకరూపు భ్రమరంబునగుగాక భ్రమర కిరీటరూపమమరిగా ట్లున్ ॰ విమలభక్తుడు యాగంటి యీశ్వరుండగుగాక భ్రమసితిరిగిన శివుడు భక్తుండుగాడు మునులింగధారియై ఘన చతుర్విదపదవి వెనుకనేటికి మాను వె లయుబాయనలింగ మది సర్వపరిపూర్ణమని తెలియకా అదికాదిదికాదని వదరుటేకాక తుదిమున్ను జూడంగతోదోష లేలా అన్నియుదెలిసినదా జపలేనియోగికిని అన్నిటనుబొదలు

చును భ్రాంతులికనేలా ॥ పుడుగలిజ్జ సంయోగమెల్లెడల గొప్ప
డనిత్యా వందపరవశుడై వడిగసత్క్రియ మరువడిసేయుటయేగా
కనడి స్వర్గమునకొచ్చి పడియెక్కెల్లా । నరయసర్వముఠోసి
నిస్సంగుడేగంటి గురులింగ స్వయభావ పరవశుండై గనిమోహ
షర్తనుడౌ కాదనక ధరషండునకుపత్ని ధారణములెల్లా ॥అన్ని॥

తత్వము:— అందు శివయోగ పరమానంద నిద్రకలగని
నపుడె మేల్కనియిట్లను వెలయు రథశిఖాపనిలయ మండగవేగ •
మెంగు నిజలింగ సుఖమేలిమగు నాలయమునాలయము నాశ్రిమ
ముచిదాకాశ బయలు విహరించు చిన్మయుడుకాదా జలధిలో
పలబుట్టి జలధిలోఁ లగఁయు వెలయతరంగములు తిరుగాడు
నట్లు అలరు పరమశివయోగమను సముద్రంబులో నెలవెరిగి
తిరుగ కేవలముక్తి కాదాలయమునాలయము నాశ్రయ దినకరుడు
తనతేజమున దినమునడిపిన గతివివినుతాత్మడీ వివేకమూన ఘన
స్వయంజ్ఞాని ప్రకాశనిర్వాణ గతిగనుట యాగంటికరుణతోకాదా॥

తత్వము.

విరచింపలింగంబు వెలయత్వపదమయ్యె • సర్వపదమై
పదిదత్పదంబు అరయ సంయోగమే అసిపదంబై యుండు
పరులనిదితత్వమన వాక్యంబుగాదా కలయనంగంబు లింగంబు
సంయోగమై పలుదెరంగులుబల్కు బ్రహ్మంబెకాదా సతతంబు
లింగంబు సత్తనందనుబరగు స్థితినంగమైనదే చిత్తుకాదా
పతుల సంయోగమే ఆనందమైయుండ సదసత్తు చిత్తు ఆనదం
బు గాదా కలయన అనుదినమునాదమే యచల లింగబయ్యే
నెనయగా నాబిందు వంగంబుగాదా ఘనత యా గం టి
గురు కలియు సంయోగమై దనరు నాదుబిందుకళచే తనము
కాదాకళయసంగంబు లింగంబుసంయోగమై పలుదెరంగులబలు!

## కాలజ్ఞానతత్త్వములు.

దెరంగులబల్కు॥

తత్త్వము:- తనుదర్పణమునందు నొనరప్రతిబింబవై తనముఖముతాను గనుగొనుచున్నయట్లు సూక్ష్మకళ నయన దర్పణంబున వెలుగు ఘనతేజ మిష్టలింగమ్ముతానెకాదా నేకమే కాదా అతడు నిర్మలబుద్ధియందు చిద్బ్రహ్మమైన తుల నంతర్ముఖంబదిగాంచినట్లు ॥ రతినాత్మధృష్టిని కరిమున వెలుగొందు నిజగతి ప్రాణలింగముదానె కాదా మేకమాత్రి విధలింగాకారము నీవై బలుకు సంపూర్ణ భావముననుండెడిని అలసిరాలంబు తానై న యాయాగంటి గురుకలిత స్వభావలింగము తానెకాదా ఏకమాత్రి విధలింగాకారమును వివేకమును దెలియ దానేకమే కాదా॥

తత్త్వము:- అరయనాలుకజిడ్డు అంటిఅంటనియట్లు పొసగ తామరనీరు బొందనట్లు గరిమభూతగచకాయ నంటనియట్లు, బురద కుమ్మర పురుగునంటనట్లు పొరలు సంసారంబు బెరయుచుండెడియోగి అరసి కోరికలందు అంటలటవట్లు ఆవనిపై రూపంబు లంటియంటనియట్లు దపలి రవి నీరునంబగలయనట్లు అవని మీదను నీడ అంటిఅంటనియట్లు వివరింప తక్రంబు వెన్నంటనట్లు పొరలుసంసారంబు పర్వతగుహలందు పలుకులంటనియట్లు గర్వులను యాగంటి ఘనుడంటనట్లు పొరలుసంసారంబు బొరయు చుండెడియోగి అరసికోరికలందు అంటంటనట్లు ॥

తత్త్వము.

చదివినందుకు మోక్షసాధకంబేమి చదువకుండిన ఘనుడు సాధింపలేదా సకలంబు బ్రహ్మమని సాటిదప్పక శ్రుతులు ఒకచోట లేదనుచు వాదింపనేలా ప్రకటించి మూల ప్రకృతిని విడిచిన యపుడు అకళంకమగు బ్రహ్మ మపుడెనగ బడును ।చ॥ మతిహీనులీ ధర్మమార్గంబు లివిమాని ప్రతిదినము దుర్మార్గ

భావమునను వెతనొంద సంసార వేదనలచేతిక్కి దూరమే యగ పదురాదు ॥గ॥ కరుణతోడుత హృదయ కమల మధ్యంబున పరి పూర్ణుడని శ్రుతులు బలుకగాను, గరిమతోడుత మాతృగర్భమం దునమండి మరితల్లి నెరుగని మాత తగవాయెన్ ॥చ॥ పరమ గురుడేకాంత భావజ్ఞుడైయుండె ఫలమేమి యిహమేమి భక్తులేమి పరుడైన యాగంటి పతినమ్మి మెలగుచె కరుణ జీవన్ముక్తి కలుగుచేకాదా ॥చదివినందుకు మోక్ష॥

త త్త్వ ము.

ఎరిగినందుకు గురుతు యెరుకయేసాక్షి ధరకెల్ల నిజము గ దైవమేసాక్షి యెరుకను నోటిపరువులు బాటిందేకదా । గురు భక్తి మదిలోన గురిగన్నయందులకు మరిలోక భ్రమలన్ని పర చుచేసాక్షి పరమవైరాగ్యంబు పాటించినందులకు వెరవుగ విష యముల్ విడచుచేసాక్షి అతి యోగానందుడైయున్న యందు లకు ఆహార నిద్రలు నుడుగుచేసాక్షి వేదబోధానంద విదితుడై నందులకు వాదభేధములన్ని వదలుచేసాక్షి తనువులోపల తెలివి తా తెలిపినందుకు తనువుపై మోహంబు తలపని సాక్షి అనిశంబు యాగంటి హరుని గొలచినందులకు మనసులో భ్రమలన్ని మా రుచే సాక్షి॥

త త్వ ము:-పారదోలి వ్యసనములను సారమత్త గజ ములడచి వీర కంకణంబుగట్టు విజయుడెవ్వడో కొలుకోలు పర మ గురుని కొలువుసేయరే కాలకర్మజననములను కడకుజిమ్మరే॥ కాలిమడిమెమొ మూల కదలకుండ నొత్తిపట్టి మూల బంధ మూర్ధ్వగతికి మొనయెడెవ్వడో నాద పంచకంబు దెలిసి నాదుకర్ణ మందుబల్కి నాదలయము జెందునట్టి నరుడు యెవ్వడోకోలు ప్రాణాపాన వాయువులను పరగ ఐక్యంబుజేసి • పూని

కాయసిద్ధిబొందు పుణ్యుడెవడో ||కో| యింటిలోన మింటినడుమ కంటిలోన కన్నుదెరచి కంటిపాపనంటె పెనగు ఘనుడెవ్వడో ||కో|| చూపులోన చూపుదెలిసి చూపుమనసు నొకటిజేసి చూపులోన సుఖముపొందు శూరుడెవ్వడో ||కో|| మాటలాడు ఆరుచుల మేటి బ్రహ్మరంధ్రమందు మేటిమాంసమారగించి మెలగునెవ్వడో ||కో|| పరుగుడు యాగంటి భవ్యదివ్యలింగ మూర్తి కరుణతోడ మోక్షపదము ఘనుడుయెవ్వడో ||కో|| పరమగురు||

తత్త్వము:- గండుపిల్లి లోకమెల్ల గారవించి యేలగాను కొండయెలుకలొక్క రెండు కొలువుజేసేనూ అండకొలిచి చిలుకలైదు అరువుగాచు కుండగాను పంతుకోతులొక్క రెండు ప్రహారి దరిగేనూ || గుట్టుతేట తెలియతెలిపి గురుతుతెలియజ్ఞానులకు బట్టబైటనుండు దీనిభావమెల్లను వుప్పుచప్పుననక నొకడు పురికిమింటికెగియగాను కుప్పిగంతులేసి పాముగరచిమ్రింగెను ముప్పుతలను గొడ్డురాలి మూతి నొక్కకొడుకుబుట్టి గొప్ప కొండలైదుమ్రింగి గురకబుట్టెను గుట్టు తేటతెలియ తెలివి భువిని నోరులేని మిడుతపులినీ మ్రింగననెడువార్త వివరముగా తెలిసి మేక వికావిక నవ్వెను అవిరళముగ దీని తెలియ నవిర ముగా దెవ్వరికిని దవిలి యాగంటి గురుడు తానెరెండునూ గుట్టుదేటతెలిసి గురుతుదెలియను సుజ్ఞానులకును బట్టబయట నుండు దీని భావమెల్లను|

తత్త్వము:- దేవుడు తనలో దండిగనుండగ తెలియదు మానవ పశువులకు సంశయముసుగక సద్గతిమేరకు సర్వము తానని తెలియవలెను సర్వముతానని తెలిసేటందుకు గురువుప దేశము కలుగవలెన్ గురూపదేశం గలిగేటందుకు నిలకడగా

మది నిల్పవలెన్ నిలకడగామది నిలిపే పరనుడు విరసము విడు
వక తెలియవలెన్॥ విరసము విడిచితె చిత్సమాధిలో మున్నత
ముగ తానుండవలెన్। ఉన్నతముగ తా నుండేటందుకు తార్కా
ణముగ గురితగలవలెన్ తార్కాణముగ గురి తగిలేటందుకు
ఉచ్ఛ్వాసంబులు నిలుపవలెన్ ఉచ్ఛ్వాసంబులు నిలిపేటందుకు
సాధకమున సాధింపవలెన్ సాధకమున సాధించేటందుకు వారక
పరిశోధింపవలెన్ వారక పరిశోధించేటందుకు యేకాంతంబున
జేరవలెన్ ॥ యేకాంతంబున వుండేటందుకు సంసారస్థితు లుడుగ
వలెన్ సంసారస్థితులుడిగేటందుకు దేవుని కృపతా గలుగవలెన్
దేవునికృపతా గలిగేటందుకు నెరుక గలిగి తానుండవలెన్ నెరు
కగలిగితె యోగంటీశుల మరుగున జేరుక నుండవలెన్ మరుగు
జేరుకొని మరియానందము మహిలో పొందుచు నుండవలెన్
దేవుడు తనలో దండిగ వుండగ తెలియదు మానవ పశువులకు
సంశయ ముడుగక సద్గతిమేరకు సర్వముతానని తెలియవలెన్॥

తత్త్వము॥ శరణు శరణుమనసా శివభక్తి రతుల గని
చరణాబ్జములపైని శిరమువంచి॥ పండితయ్యనుదలచి ప్రభుకీర్తన
ము జేసి గుండయ్య కొనియాడి కోరికలరా దండిగా శంకరాదా
సమయ్యను దలచి బంగారు బసవని బాడవే మనసా ॥శ॥ కర్మ
ములయందు దగ్గర జేరకే మనసా కర్మములు బహుజన్మ కారణ
ములు కర్మములయందు దగరజేరకే మనసా నిర్మలజ్ఞానిపై నిలు
పవే మనసా ॥శ॥ దుష్టేంద్రియములందు తూలి పారకే మనసా
అష్టాంగ జపంబుపై అనువుపరచి యిష్టంబులో ప్రాణమిరవు
కొలపవే మనసా ఇష్టలింగము భక్తి నిలుపవే మనసా ॥శరణు॥
పరసతిని తల్లిగా భావింపవే మ న సా పరధనంబుల కాస

పడకవే మనసా పరనిందలకు వెడలి పొరల కుండవె మనసా పరకర్మములు తలుకవే మనసా ॥ శ ॥ భవసంఘముల బాసి పరద్రవ్యములరోసి భయములన్నియుబాసి భ్రాంతులెడబాసి శివ భక్తులనుడాసి సేవలన్నియు చేసి శివభక్తిమార్గమున చెలగవే మనసా ॥ శ ॥ భక్తిహరి బ్రహ్మాది పరులెరుగుదురు మనసా భక్తి గురుకారుణ్య ఫలపుణ్యము భక్తితో శివునిగనిరి ప్రమదాదు లందరును భక్తిముక్తుల కరుణబడయవలెను మనసా ॥శ॥ ౽॥ అరసి భక్తులకరుణ ఆనందమును బొంది పరగబసవని కరుణ బాయకెపుడు పరమగురుడింట నతనియాత్మలో నిలిపి వరపయో జ్ఞానివై నిలుపవే మనసా ॥శ॥

తత్వము॥ ఇదియేఖేచరీముద్ర యిదినిత్యమౌను పదిల ముగ సాధింప బ్రహ్మమగపడును ॥యి॥ నలిన మనచిత్తంబు లయముజెందెటివేళ బయలులో బయలు నిర్బయలు కనబడునూ చూపు నిలిపిన యపుడు రూపంబు గనపడును చూపు రూపొక టయితె పాపకనుబడునూ పాపమధ్యనను న్న పరంజ్యోతి రూప మై దీపంబుగనబడును దివ్యపురుషులకును ॥ యి ॥ సత్యమనె వత్తి వరస వత్తిగను జేసి చిత్తమలరగ సమురువత్తి ముట్టిం చి చిత్తమలినంబాయె శ్రీ గురునికృపచేత ప్రత్యక్ష యాగంటి ప్రభువు తానౌనూ॥

తత్వము। రాజయోగానంద రసికుడయ్యేదెట్లు లోచూ పునకు మనసులో గాకయున్నజా నిరతంబు శివపూజ నియ మాగ్నికళలేక అరుదైన విషయంబు లది అణుగుపెట్లు గరిమ రేచక పూరకముల నేర్పులబడక పరగ ఆసన ప్రాణ పారీణు డగునా అత్యద్భుతంబైన ఆశలుడిగిన గాక సత్య మార్గంబనెడి సౌజ్ఞగలదా నిత్యప్రణవఘీంకార నికరమాలింపక ప్రత్యాహార

## కాలజ్ఞానతత్త్వములు.

సావధాన పారీణుడగునా ఆగమాంతము దెలియ నలవికాదెవ్వ
రికి నాగునాకోపాగ్ని చల్లార్చకా నాగకన్నియను దానసువు పర
చినగాని యోగమార్గసమాధి యొడుగూడుబెట్టు రాజయోగమున
వాక్కును మరికాయకర్మము లపహరించి యొక్కటిజేసి దనరు
యాగంటిగారు తత్వంబుమరిలేక శివజ్ఞానసంగతి జేరగనదా ॥రా॥
పరిమి వీరాచార్యులు నిత్యసేవా నిజము నిలకడమీద
తెలియును అనిపెద్దలు నిశ్చయించిరి యాగంటి లక్ష్మప్ప గారి
తత్వములు సంపూర్ణము.

---

### రాగం - ఇంగ్లీషువర్ణమెట్టు.

శివపంచాక్షరి మంత్రం పరమశివయోగులకే జపసూత్రం
అవిరళయోగం బందినవారికి ఆరింటమీద చిద్రూపం ॥శివ॥ అయి
దు ముఖంబుల పెనగింది అయిదక్షరముల నమరింది అయిదు
అయిదులు యిరువదియైదు అఖండ తేజంబీ మంత్రం ॥శివ॥
మూడుత్రోవలది సాకారం మూటినడుమను శ్రీకారం చూచేదంత
యు సాకారం చూపునిలిపితే నిరాకారం ॥శివ॥ సుషుమ్నాంతము
న గురుతేజం అష్టకమలమున శివపూజం వేయికమలమున మహా
పూజం గురువీరేశుని ఘనతేజం ॥శివ॥

### రాగము—నాదనామక్రియ — ఏకతాళము.

ఎంతమంచి గురుడు దొరికెనే ఓయమ్మలారా ॥ఎంత॥
ఎంతమంచి గురుడుదొరికితె అంతరంగమందునన్ను చింతలేక
గురుని పాదము చెంతజేరియుండుమనెను ॥ఎ॥ కన్నులు వీనులు
మూసి గాలిరాకపోక దెలిసి పున్నమ వెన్నెలబైట కన్ను తెరచి
జూడ మనెను ॥ఎ॥ పంచకోశములుబాసి పంచముద్రలన్ని రోసి

పంచవింశతి తత్త్వమావల బట్టబైట జేరమనెనె ॥ఎ॥ పరమ మహమ్మదు హుశేన్ దాసు బ్రహ్మమే నారాయణుడు ధరణిలో శివపోతులూరి దైవరాయటొక్కడనెనె ॥ఎం॥

రాగము— సౌరాష్ట్రము —చాపుతాళము

చెప్పెద గురుమహిమ తెలిసినంతట మీరు తెలుసుకొండి విప్పిచెప్పగ నేనెంతటివాడను శరణంటి నొప్పుకొండి ॥చె॥ చింత మ్రానిమీద చేమంతిపూచెను తెలుసుకొండి ఆ చేమంతిమీదను చెంగల్వపూచెను తెలుసుకొండి ॥చెప్పె॥ భూరుహమున రెండు పుట్టలుగలవయ్యా తెలుసుకొండి ఆ పుట్టలో రెండు సెనుబాము లున్నవి పట్టుకొండి ॥చె॥ పట్టుకొనినమీదను పైగా రెండు గుడ్లు తెలుసుకొండి ఆ గుడ్లమీదనొక గూబ కూర్చున్నది తెలుసుకొండి ॥చె॥ మూడుమూలలపెట్టె మూతదీసేనేర్పు నేర్చుకొండి ఆమూత దీసితె పెద్ద భూతమగుపడును తెలుసుకొండి ॥చె॥ భూతము నెత్తి పై జ్యోతియొక్కటి కలదు తెలుసుకొండి ఆజ్యోతి వీరబ్రహ్మం శివపోతులూరయ్య తెలుసుకొండి ॥చె॥ తెలిసినవారికి తేనె మామిడిపండు తెలుసుకొండి తెలియని వారికి విషముష్టిపండని తెలుసుకొండి ॥చెప్పెద॥

ముఖారిరాగము—ఏకతాళము.

ఊదేతిత్తులపైగానుండే ఉన్నది తెలియర ఓరన్నా తిత్తుల నడుమను చక్షులమీదను చీకటిగొట్టర ఓరన్నా ॥ఊ॥ చీకటి గొట్టను తోకనాలుక తీసుకలేవగ ఓరన్నా తీసుకలేపిన కాకకు పాము చిఱ్ఱినలేచుర వోరన్నా ॥ఊ॥ శంఖ చక్రముల నట్టనడుమను ఆది శేషునిలేపర వోరన్నా ఓంకారించుక యున్నదిపాము కొంకకలేపర వోరన్నా ॥ఊ॥ ఆరుచక్రముల కావల యీవల లోపల వెలుపల వోరన్నా ఆరుచక్రములు ఫెనుచుక పాము

## కా ల జ్ఞా న త త్త్వ ము లు.

అధోముఖంబై ఒరన్నా ॥ఊ॥ రెండుచక్రములు విడబడియున్నవి కుండలిలేపర ఓరన్నా రెంటికి సూత్రము మలిమట్టొకటె లేపె పోతులూరి వీరన్నా ॥ఊ॥

రాగము.—— ధన్యాసి ఏకతాళము.

చిల్లర రాళ్లకు మ్రొక్కుచునుంటే చిత్తము చెడిపోవు నొరేనొరే చిత్తమునందున చిన్మయజ్యోతిని జూచుచునుండుట సరేసరే ॥చి॥ ఒక్కప్రొద్దులని యెంచుచునుంటె ఒనరుగ జెడుడువు ఒరేఒరే ఏకమైన మా వైభవమూర్తిని జూచుచునుండుట సరేసరే ॥చి॥ నీళ్ళలో మునిగి గొణుకుచునుంటేనిలకడజెడునుర ఒరేఒరే నీళ్ళలోనుండే నిర్మలజ్యోతిని జూచుచు నుండుట సరే సరే ॥చి॥ భాధగురువుల పంచనజేరితె భావముచెడునుర ఒరే ఒరే భావమందున బ్రహ్మకాంతిని చూచుచునుండుటసరేసరే చి॥ భూములు అడవులు తిరుగుచునుంటే బుద్ధులు చెడునుర ఒరేఒరే బుద్ధిలొ వుండే పున్నమచంద్రుని జూచుచునుండుట సరేసరే ॥చి వీరయ్య చెప్పిన వాక్కును నమ్మితె వివరము తెలుసును ఒరే ఒరే వివరమందుండె విగ్రహమూర్తిని జూచుచు నుండుట సరేసరే ॥చిల్ల॥

రాగము——మాయామాళవి—ఆదితాళము

కాశికి పోవలెనా తేర్థము మోసుకరావలేనా కాశితీర్థము కన్నులనున్నది బేసికన్ను శివకాశిగ నున్నది ॥కాశి॥ అంగము లోపల కుండలి సంగము దాపునను గంగాయమునా పొంగుచు పారగ రంగుగ నడుమను లింగడుండగను ॥కాశి॥ కోనకుపైనను తీర్థసోన గురియగాను మేఘమరచినీవు కానక తిరిగేవు లోను వెదికి శివధ్యానము జేయక ॥కాశికి॥ భావములోను జీవునితావు తెలియకాను జీవగుణంబును చిక్కువిడిచితా జీవబ్రహ్మము

కావు దెలిసితె ॥కా॥ వాసిగధరలోను కాశి నివాసుడుండగాను జే
సిన పాపము బాసిపోవునని కాశికిపోదురు నివాసునినానక ॥కా॥
పొందుగ ధరలోను వీరగోవిందుడుండగాను అందమైనగురు ఈ
శ్వరిపాదము అందితెకైలాసమందే యున్నది ॥కాశికె॥

సౌరాష్ట్రిరాగము - ఆదితాళము.

నడిమికంటిలోన నారాయణుడున్నాడు నాతులారా మడు
లా దీపము మఱి వెలుగుచున్నది మగువలారా ॥న॥ ఎడమకుడు
ల నడుమ వెలుగుచున్నాడు వెలదులారా ముడిబొమల సంచున
మురియుచున్నాడు ముదితలారా ॥న॥ ఒడయని ముఖమందు
పొడమిన వాడమ్మ వనితలారా పుడమి లోపల యీ పుణ్యుని
గానరు పూబోణులారా ॥న॥ నీళ్ళకుండల నడుమ నిక్షేపమున్నది
విరిబోణులారా నీళ్ళలో మునిగి తన వ్రేళ్ళు యెంచినలేదు వెల
దులారా ॥న॥ వ్రేళ్లు పాచిపోలేక మతినిండిననాడు అలివేణులారా
గోళ్లు పెంచుకయెంతొ గొణగిననులేదు కొమ్మలారా ॥న॥
జంట నాగస్వరము లటుక యున్నాడు జాణలారా
కోటంటితామర నీరంటనట్టున్నాడు అతివలారా ॥న॥ మింటినడుమ
మిధునశేషమై యున్నాడు పూబోణులారా కంటిలోపల ముక్తి
కళలంటి పెనగునె కాంతలారా ॥న॥ తన్నుతా తెలిసిన ధన్యులకీ
పండు తరుణులారా కన్నచోటనె వున్నదికని యనుభవించెరె
కాంతలారా ॥న॥ కందిమల్లయ్యపల్లె మందిరమున నుండి
కాంతలారా ఇందుధరగోవింద బ్రహ్మమైయున్నాడు లలనలారా
॥న॥ అందముగా గురు ఈశ్వరమ్మపాద మతివలారా చెందిన
వారికి చేదొరకు నీపండు ॥చెలియలారా॥

## కాలజ్ఞానతత్త్వములు.

### ధన్యాసి రాగము—ఆదితాళము,

యజ్ఞముచేసే సుజ్ఞానులకు వేదోక్తమువిధి తెలియరయా
ఆగమసారములనే శబ్దములన్నియు మనుతా నెరుగవలెన్ ॥య॥
అగ్రజన్మమయినందుకు తనలో అగ్నినిలేపి గూర్చుండవలెన్
ముగ్గురి హితవుగ మూగజన్మములు పొలమందు శోధింపవలెన్
॥య॥ ఊది దూది పొయ్యేదెప్పుడు పూపిరి సమరస మెరుగ
వలెన్ ॥య॥ సారంబగు సంసారధరులై చవిలో చవిగని తిరు
గ వలెన్ ॥య॥ కామక్రోధమను ఒకువునుబట్టి కర్మ ద్వారమున
కట్టవలెన్ కాకోజ్వాలల ఓలలాడుచును యేలబాడుచు నుండ
వలెన్ ।య॥ మనోబుద్ధి చిత్తహంకారంబున మరిగిన కండలు
తరుగవలెన్ సుఖుని నుక్కుగా నుడిబడి కన్నుల చూపున
మంటలు వ్రేల్చవలెన్ ॥య। మగ్నత్వంబున అగ్నిలోవ్రేల్చే మ
నసు క్రొవ్వుపౌరతీయవలెన్ సుజ్ఞానులను సుబ్రహ్మణ్యులంత
సుషుప్నమందు సుత్రాంగవలెన్ ।య॥ సత్తు చిత్తు ఆనందం బని
యే చవిలో చవిగని తిరుగవలెన్ ॥య॥ జాతినీతులా జరామర
ణములు బూతి దూషితో కొట్టవలెన్ ॥య॥ అండపిండ బ్రహ్మాం
డంబులు మూడుకుండలి యని తానెరుగవలెన్ అంబర వీధిని
రంభ యూర్వశిదాటి వీరగురు జేరవలెన్ ॥య।

### ముఖారిరాగము—ఏకతాళము.

మనో నిరంజనమైతేనూ మాటలేల మనకు మనోనిరం
జన మైతే మాటలాడ నెవ్వరితోను ఊరకె కొన్నాళ్ళు వుండిన
దినములు అయితే పోవలెనూ ॥మ॥ కండలు యెముకలు కాయ
ము తోలు శివునికి తారక మాయెనయా పెతల దేహమిది సత
త మని నమ్మితె ముందరగతి మనకెట్లనయా కల్లుభంగి సారాయి
త్రాగి ఒళ్లుమరచిపడనేలనయా త్రాగినప్పుడెతప్పుకూసుకొనినొప్పి

పడనుమనకేలనయా ॥మ॥ తిండిపోతు ముండలకెల్లను తిరుపతి యాత్రలు యేలనయా త్రాగుబోతు ముండలకెల్లను పారమార్థిక మేలనయా ॥మ॥ హద్దుమీరి తిరిగేముండకు బుద్ధిచెప్ప మనకేల నయా గద్దరితనమున పురుషులదిట్టె గయ్యాళులజోలి మన కేల నయా ॥ టక్కు పిక్కు రెండబద్ధమాడి దినము గడుప మన కేలనయా మూడుదినంబులు బ్రతికే జీవునకు అబద్ధమాడ నేల నయా ॥మ॥ వుత్తమగురువుల పాదముబట్టితె వుత్నమతి పోనేల నయా సత్యవాక్యమై నిత్యంబనుకొని సద్గురు భజనలు సేయర యా ॥మ॥ గురుసూత్రాకారుండైతే గురుని గురుతెరుగరయా . హరుడే శివపోతులూరి వీరబ్రహ్మము చేరరయా ॥మనో॥

ఆనందభైరవి రాగము—చాపుతాళము,

పాదసేవకుడు పాదరక్షకుడ గురుపాద రేణువునకును అర్హుడను విన్నమాత్రమున జెప్పవచ్చితిని అన్నలార మీరు తెలి యరయా ॥పా॥ అగమతంబిది యోగమతంబిది భోగమతంబిది యోగమయా ఈదరాదు సంసారభారములు యిరువుగాను పర ము వెదుకరయా ॥పా॥ తెలివిలోపల తెలివై యున్నది వేదబ్ర హ్మలై తెలియరయా మీరు వేదబ్రహ్మలై తెలియరయా . అలయుచు సొలయుచుకామయోగులై రంభకళలపై చిక్కరయా ॥పా॥ సప్తకోటి మహామంత్రములకు సారమ సారములోని చూ డరయా సారము దెలిసినవారే బ్రహ్మస్థానమందు నిలిచి యుందు రయా ॥పా॥ ఉపశ్రుతి వాక్యములుండ జూచుకొని మంత్రము మీద పలుకరయా జాతినీతులు జన్మరమణాదులు వూచివూచి జో కొట్టరయా ॥పాద॥ వీరవాక్యమిది దారబోసితే యిందుకొండటి కందరయా సంధితెలియని పంద మానవులు బారి గొర్రెలై చిక్కరయా ॥పా॥

## [8] కాలజ్ఞానతత్త్వములు.

హిందూస్థానీ రాగము - చాపుతాళము.

కనుపదగ్గరబోయి కథలకేమనసా కనుపదాటిపోతె కలుగునే నేవా ॥క॥ చెడుగుణంబుల జిక్కి చెడిపోకె మనసా చేరి సద్గురుని సేవించవే మనసా ॥క॥ ఆలుబిడ్డలనమ్మి ఆట్లాడకే మనసా ఆనందమైనయింటిలో ఆట్లాడవే మనసా ॥క॥ సంతకూట మిది సంతసించకె మనసా సాగిపొయ్యేదారి సాధించవే మనసా ॥క॥ నీవు నేను అని నిక్కకె మనసా నీలతోయదమధ్య నిలువవే మనసా ॥క॥ నీవు నేను అని నిక్కితె మనసా ముక్తికాంతనంటి ముద్దాడవే మనసా ॥క॥ మంటికుండవంటిదియిదిమతిచెడకె మనసా మహనీయ జ్యోతిని మరువకే మనసా ॥క॥ యెప్పుడో యేవేళనో యెరుగవే మనసా ఎరుకలోని యెరుక యెరుగవే మనసా ॥కన॥ వీరయ్యాదాసునిమాటవినవెఓమనసవివరమెరిగితెవింతగనుమనసా

నాదనామక్రియ రాగము — ఆటతాళము.

దరిజేర్చి కడతేర్చు దాతవైతివి మాకు భీతియేటికిరామా ఈతనేర్చిన వీరగురుడు మాతలిదండ్రి సూతనము జేసెనురామా ॥ద॥ తండ్రిగర్భములోను దాహమోహరమయి తగిలుంటి కొన్నాళ్లు రామా ॥ మాతృగర్భము జొచ్చినది మొదలుగా బీజమాయగ కొన్నాళ్ళురామా ॥ద॥ చిప్పలో ముత్యంబు చినుకువలె కొన్నాళ్ళ చిక్కుపడి నేనుంటిరామా మలమూత్రములగుంట మాంసమెముకలతోను మాతల్లి గర్భమునరామా ॥ ద ॥ తల్లిగర్భములోను తగతొమ్మిది నెలలు దాహమేమెరుగను రామా మురికి గర్భములోను ముద్దనై కొన్నాళ్ళు తపసినయి నేనుంటిరామా ॥ద॥ తల్లి గర్భమున వెడలి ధరణిలో కొన్నాళ్ళు తపసినయి నేనుంటిరామా తెక్కవిరిగిన పక్షివలెను నేకొన్నాళ్ళు దుఃఖమే మెరుగనురామా ॥ దరి ॥ పాలువెన్నలుద్రాగి పారాడె నాబాల

## కాలజ్ఞానతత్త్వములు.

ప్రాయము కొన్నాళ్ళు రామా మలములోపొరలుచు మరికొన్ని దినములు మర్యాద నేనెరుగ రామా ॥ద॥ పదునైదుయేండ్ల పు వనైనే బహుతులవనయి నేనుంటిరామా ॥ అదిగొ ముప్పది యేండ్ల జంటభామలకు తగిలి శంరనయి నేనుంటిరామా ॥౮॥ వన్నెవాసియు లేకవసుధలోకొన్నాళ్ళు మసకలోపడియుంటిరామా మసకనెడు సంసార మత్తుండనయినేను హింసతెలియకపోతిరామా ॥ద॥ హింసలో యీ వుపము యీసారి దొరికెను మరిహి నచే జిక్కెరామా తలిదండ్రులెందరో దెలుపతరముగాదు తారకము నెరిగితిని రామా ॥దరి॥

### ముఖారి రాగము — చాపుతాళము.

ప్రపంచనడత జూటా మనపెద్దలవాక్యము బాటా ముగ్గురు మూర్తులు జూటా మూలముయెరుగుట బాటా ॥ప్ర॥ చదువు శాస్త్రములు జూటా ఒకె సద్గతి యెరుగుటబాటా ॥ప్ర॥ అన్నిటిని గొల్చుట జూటా తన ఆత్మలో యెరుగుట బాటా ॥ప్ర॥ మడి మంత్రములు జూటా మదిలో యెరుగుట బాటా ॥ప్ర॥ యెగ్గులు జేయుట జూటా రాజయోగము యెరుగుట బాటా ॥ప్రపంచ॥ కొండలు తిరుగుట జూటా ఈ కోటయెరుగుటబాటా ॥ప్రపంచ॥ కాశికి పొయ్యేది జూటా మనకంటిలొ యెరుగుటబాటా ॥ప్రపంచ॥ గురువులేనిదె జూటా గురు కీలకము యెరుగుటబాటా ॥ప్రపంచ॥ పరులను యెరుగుట జూటా గురుపాదము నెరుగుట బాటా ॥ప్రపంచ॥ వీరయ్యదాసునిమాటా దాదివివరము యెరుగుట బాటా ॥ప్ర॥ నమ్మినవారికి జూటా గురునమ్మిన వారికి బాటా ॥ప్రపంచ॥

### ముఖారి రాగము — త్రిపుట తాళము.

ఏవూరయా మీదేవూరయా పరబ్రహ్మ నిర్యాణమే మా

వూరు ॥ఏవూ॥ కందిమల్లయ్యపల్లె మావూరు కాల కర్మాల బాపు
ను మావూరు ॥ఏవూ॥ కనుయెదుటనుండును మావూరు అట్లు కన
వచ్చు కనరాదు మావూరు ॥ఏ॥ ఇంటిలోపలిపుట్ట మావూరు
పాములంటితె ఫలమొచ్చు మావూరు ॥ఏవూ॥ కర్మ జీవులకెల్ల
మావూరు అంధకారమైయుండును మావూరు ॥ఏవూ॥ కర్మము
తెగితేను మావూరు పండు వెన్నెలై యుండు మావూరు ॥ఏవూ॥
రోగాలు లేవయ్యమా వూరు నిత్యభోగాలు గలిగుండు మావూరు
॥ఏవూ॥ జుంటి తేనీయపల్లె మావూరు నిత్య భోగాలు గలిగుండు
మావూరు ॥ఏవూ॥ కనికానకున్నది మావూరు ముక్తి కారణమై
యుండు మావూరు ॥ఏవూర॥ పాపలనడుమను మావూరు బట్ట బ
యలై యుండును మావూరు ॥ఏవూర॥ శృంగారమైయుండు మా
వూరు శ్రీరంగమ్మ నివసించు మావూరు ॥ఏవూర॥ తల్లి గోవిం
దమ్మ మావూరు తండ్రి వీర బ్రహ్మం మావూరు ॥ఏవూర

### చక్రవాకరాగము - ఏకతాళము.

ఈ జన్మ మిక దుర్లభమురా ఓరి సాజన్మ సాకార సద్గు
రుని గనరా ॥ఈ॥ పంచాక్షరీమంత్ర పఠన చేయరన్న పఠనచేసిన
యముడు పారిపోవన్నా పారిపోతె అంబ ఫలమిచ్చునన్న ఫల
ము నందినవాడు పరమగురుడన్న ॥ఈ॥ మూడారువాకిళ్ళు మూ
యు వలెనన్న ముక్తి వాకిట నిలిచి తలుపుదీయన్నా ॥ఈ॥ తలు
పు దీసితె అంబ తేజమిచ్చున్న తేజమందినవాడు తా గురుడో య
న్న ॥ఈ॥ ఆరు నదులమీద అంబవుందన్న అంబతో దుర్గాంబ
నాట్లాడునన్న ॥ఈ॥ నాసికలోదృష్టి నడిపించుమన్న నడిపించి
మరినీవు నమ్మియుండన్ననమ్మిననవరత్నములపీఠయెక్కన్నపీఠ

మెక్కిన అంబపిలుచునోయన్న పిలిచినంతట నీవు నిలుచుంయుప న్న నిలిచినంతటవాడు నిజగురుడన్న జంటక్రోవులు రెండు అం టివూదన్న అంటి వూది మేన్మరచి యుట్టెనిలువన్న మేనుమరచి ఘంటనాద మినుమన్న నాదమిని పోతులూరిని నమ్మి యుం డన్నా ॥ఈ॥

నాదనామక్రియ రాగము—చాపుతాళము

ఏదిరా కులము ఓరి నాదుకులంబని నడుపరజాణా ॥ఏ॥ ఏదిరా కులము యెరుగక తిరిగేవు నాదుకులంబని నడుపరజాణా ॥ఏదు॥ నాదుబిందు పండునట్టి యుంచిరా కులము భేదములెంచి నట్టు భ్రమయనేలా నాదుపెట్టిన తావు నాణ్యము తెలిసితె నాద మందు కులమునంటియున్నదిజాణా ॥ఏ॥ స్త్రీ పురుషులనేకులము సృష్టిలోపల రెండు రూపులై యున్నవి రూడిగాను ఆ పరబ్రహ్మ ము ఆది విష్ణువు శివుడు స్త్రీపురుషులైనారు సృష్టిలోపలజాణ. ఆదియైన కులము పాదుతెలియక వాదము లాడేరు వరుసతిప్పి మాధవనామము మర్మము తెలియక వాదమే కులమని నమ్మ రా జాణా ॥ఏ॥ సారమైనాకులము ఓంకారమైయుండు వీరగోవిం దుని కరుణతోను కారణగురుదేవు యీశ్వరికృపచేత సారమైనా కులము సాధించితిమి జాణ ॥ఏదిరా॥

ఆనందభైరవిరాగము—చాపుతాళము.

ఆనందమైన పువులు గోతామా ఆత్మా రాముని పూజచేతా మా కందర్పజనకుని యిందిర శ్రీ నెపుడుబిందు పీఠమునందు పొందికైయున్నది ॥ఆ॥ భావ భావము నందు జూతామా భ క్త జనుల సంతోషము చేతామా ॥ఆ॥ భావమందునగురుని దల తామా భక్తితో హరిపూజ జేతామా ॥అ॥ శ్రీ గురుడీతడని గొలు తామ మనచిత్తమందుపూజజేతామ ఓ మహిమనంద నీమహిమ

## కా ల జ్ఞా న త త్త్వ ము లు.

దెలిసెను సామజవరదుని సతికి పూజలుమనము ॥అ॥ కమ్మని మధువును గ్రోలుచు మనము నెమ్మదిగా పూలుగోయుచు సమ్మతి భావములిమ్మని మదిలోన సమ్మతిగా పూజలు నేర్పుతోను మనము ।అ॥ అంగములోపల జూతామా భుజంగ భూషణు సేవ సేతామా అంగములోపల లింగము గనుగొని అంగ సంయోగము శృంగారముగా మనము ।జ॥ మూడారువాకిళ్ళు మూతామా మోక్షద్వారపు తలుపు దీతామా వేడుకతో పోతులూరు నివాసుని ఇదాపింగళనడుమ వీరగోవిందుని ॥అ॥ పట్టితిమమ్మా మీపాదము బట్టి బయలైన బ్రిహ్మ పూజ చేతామా గట్టిగ శ్రీ పోతులూరి యీశ్వరి దేవినన్ను చేపట్టి రక్షించు పరమ పద్మరాణి ॥అ॥

నాదనామక్రియరాగము ఆటతాళము.

ఎంతలెక్క దిరిగిన నేమిలేదురా చింతజేసి చూడకున్న వింతలేదురా ॥ఎం॥ ముక్కుదిక్కు యెక్కుబెట్టి నిక్కిచూడరా ఆదిక్కు మూలనేమొ గాని దివ్యమాయెరా ॥ఎం॥ ముసుకులోనె ముసుగువేసి పొసగ చూడరా ఆ ముసుకులోనె ముసుకుదీసి ముక్తి చూడరా ॥ఎం॥ ఆకాశమునగాలి విసిరెనది గొ చూడరా ఆగాలిమూలమేమొగాని మూలచూడరా ॥ఎం॥ మూలమూలశోధించి ముక్తిచూడరా ఆమూల నున్న జ్యోతిని ముట్టించి చూడరా ॥ఎం॥ చల్లగాలి విసరితె మొల్లలాయెరా ఆ మొల్లల కాశించిన వాసన కొల్లలాయెరా ॥ఎ॥ ఎరుపు నలుపు తెలుపు లదియేమొ చూడరా పచ్చపసుపు కలసినట్టి పద్మమాయెరా ।ఎం॥ సత్తు చిత్తు యొకటయితె శివుని పేరురా ఆసత్తు పో తు లూ రి బ్రహ్మస్వామి పేరురా ॥ఎ॥

## కాలజ్ఞానతత్త్వములు.

### యదుకుల కాంభోజిరాగము - ఆదితాళము.

ఆహా బ్రహ్మాంశమయినది ఆదిమంత్రము మనబ్రహ్మంగారు చెప్పినది పెద్దమంత్రము ॥అ॥ తెక్కముక్కులేనిపక్షి రేయింబవలు తపస్సుచేసి వొక్కచెరువు చేపలన్ని యొకతేమ్రింగేను ॥అ॥ ఇంటివెనుక తుట్టెపురుగు ఇంటిలోనందరిని మ్రింగె ॥ చూడవచ్చిన జనులనెల్ల చూచిమ్రింగేను ॥అ॥ కాళ్లు చేతులు లేనివాడు కడవముంతచేతబట్టి నిండుబావి నీళ్ళన్ని యొకడెముంచెను ॥ఆ॥ ఏటిమీద స్వాతికొంగ వేటలాడుచును రాగ చాటుననున్నమీను పిల్ల అట్టెమ్రింగెను ॥ఆహా॥ చెప్పినాడు వీరదాసు చోద్యముగాను ఆత్మ తత్వము గొప్పవారు దీనిభావమువిప్పిచెప్పినుతే చాలు ॥ఆ॥

### నాదనామక్రియ రాగము - ఆదితాళము

చెడుగుడాడెనే బ్రహ్మం బలిగుడాడెనే చెడు గుడు గుడుయని గుమ్మన్నాదము కలసిబిందుకళలను గూడుక ॥చె॥ ముప్పదిరెండక్షరమ్ములలో మేలయినదొక యక్షరంబుతో కై గుబికై గుబికై గుబిగూయుచు నాల్గుముఖముల నలుగురితరిమి పదిదిక్కులకు పరుగెత్తించి చెట్టుకొట్టగా పాలుకారగా ॥చె॥ చండతేజమై నిండు పౌర్ణమి పండువెన్నెలై ప్రబలికాయగా ఆకటముగ్గురు యాకట నలుగురు నడుమనొక పెనుబుద్ధి కతో నిలిచి సోహం సోహంసోహంబని చెంగటబలుకుచు ॥చె॥ ఆర్గురు చెల్లిరి ఆటగెలిచెను అయ్యజూచెను ఆనందించెను వింత తెలిసిన వీరపోతులూరు ॥చె॥

### ఆనందభైరవి రాగము - ఆదితాళము

ఎక్కడివింతే ఓయమ్మా ॥ యెక్కడివింతే ఎక్కడివింతే వీరగుపడు వెదకిపట్టి నన్నుతెచ్చి మతముల మంత్రాలమెల్ల హితవు జేసిదారబోసె ॥ఎ॥ పుట్ట గిట్టకుండ మేనభూతి పూసి ఈ తీరు

## కాలజ్ఞానతత్వములు.

పట్టులేని సంసారభ్రాంతులన్ని విడువుమనె ॥ఎ॥ కామక్రోధ లోభ మోహ గర్వములను కదకుజిమ్మి కారణమైనా దీపములో కన్ను దెరచిచూడుమనె ॥ఎ॥ ఎక్కడివింతే వీరగురుడు వెదకిపట్టి నన్నుదెచ్చి ముక్కుదిక్కు యెక్కబెట్టి నిక్కిచూడుమనె నమ్మ కుండలనగా వాదమనగా అఖండమైనా జ్యోతి జూచిరెండు యిండ్ల నడుమ అపజకుండలి రేచింపుమనె ॥ఎ॥ చర్మ ధర్మ మిదున మనగా శేషినే శేషిననిగా వాసియైన వీరగురుడు వాసిగాను యేలెనమ్మా ॥ఎక్కడి।

రాగము ఆనందభైరవి -ఆదితాళము,

చందమామ చందమామ చందమామ ఈసంధితెలిపే జ్ఞానులారా చందమామ కాయమను పుట్టలోన చందమామ పాము మాయెగానే మెలగుచుండు చందమామ ॥చ॥ జంట నాగస్వరములూది చందమామ పాము పాదు పెకలింప వలెను చందమామ ॥చ॥ తొమ్మిది వాకిళ్ళు మూసి చందమామ పామును నెమ్మదిగా పట్టవలెను చందమామ ॥చం॥ భక్తియును కట్టుగట్టి చందమామ పామునుయుక్తిజేసి పట్టవలెను చందమామ ॥చ॥ దేహదేహాముల నందు చందమామ పాము తెలియకుండా చుట్టుకొన్నది చందమామ ॥చం॥ అపజ మంత్ర ధ్యానముచేత చందమామ పాము అఖండ కళలతో వెలుగుచుండును ॥చ॥ పామునుబట్టె జోగి యెవరె చందమామ వోహో అతనిపేరు సిద్ధగురుడు చందమామ ॥చ।

రాగము సౌరాష్ట్రిం తాపుతాళము,

తియ్యనిమామిడి పండు పండుతినబోతె దొరుకదు తీపువెం డులు ॥తి॥ పండు వృక్షము ప్రజలెవ్వరెరుగరు పరమాత్ముడనయి యాకుపై నుండురా పడుయిరువయినాల్గు పర్వ

ములై యుండు పరమగురుధ్యాన పరులకేపండు ॥తి॥ విత్తులేని పండు విశ్వములోనుండు సత్యము యీమాట నిత్యమయా హత్తుగ తల్లికి ఆబిడ్డమగడయితె సత్యము యీమాట నిత్యము గనుడీ ॥తి॥ కొమ్మలు కొనపూవులుగూడి విఱ్ఱివీగుచు నుండు మణిమంత్రమనియే మహిమతోడ అల్లుండ్లు కొడుకాయ తండ్రి పెనిమిటాయె అమ్మకూతురు చెల్లె అనుభవమైయుండు ॥తి॥ ఆకులు పువ్వులు ఆనందముగ పిందె లోకములో కాయకాచి యుండు ఈ కాయలోను కాయ పాకము తెలిసితె క ఖా లు చది వితే కలమాగుపండు ॥తి॥ ఒరులాకు నాపండు యొకదినుసుగా యుండు నరులకు యీపండు సమ్మకుండు ధరలోన యీపండు దాసులకై యుండు పరులకు యీపండు పండుగాకుండు ॥తి॥ జ నులు లోకబేధమున చపలమయి పొయ్యేరు జనన మరణములేని జాతిపండు వాలాయముగాపండు ఓంకారమై యుండు మాతల్లి మహామ్మాయి మర్మామిపండు ॥తి॥ ఆలు మగడు రెండు ఆవిలేని వాడు కొడుకు కూతుసుకన్న కొడుకేడిరా అల్లుని తల్లియు హరిహరాదులకంటె ముల్లోకములతోడ ముగ్గురిని మ్రింగు ॥తి రేయి పగలునులేక రవిచంద్రులును లేక పంచభూతములులేక ప్రతి భూతమై పదునాల్గు లోకములు యేలుచున్న సిద్ధగురుని వద్దనేయుండు ॥తియ్యని॥

రాగము — మోహన ఆటతాళము.

ఏమి దేహము పనికిరాని దెందుకీ మోహము జాల మ నెదు సంసారబంధములోన జిక్కి మూలమెఱుగని ॥ఏ॥ పంచేం ద్రియములను తనలో శోధించి త్రుంచి వేయకను చంచలముఛే దించి తనలో మంచి ప్రకృతి అంచితముగ మంచివాడై గురుని పంచనుపొంచి కాచియుండ నేరని ॥ఏ॥ వాడలోపలను యేదిం

టిని జోడు కూడుకొని ఆరుగూడక మూడుదెలిసి జాడగూడ యేకముగను కాటుకపక్షుల రెంటిని కదియబట్టె క్రమము తెలియని ॥ఏ॥ అష్టమదములు యెల్లప్పుడు నిష్టదెలియకను కష్టపడకను యిష్టమెరిగితె కిష్టలన్నియు నష్టమగునుదృష్టిలోపల దివ్యాత్మను నిష్టతో జూడంగనేరని ॥ఏ॥ మూటబెనగుచును ముమ్మారు చోటుగానకను మూడుమూడు ఆరుగడచి ముక్తిపతిని అంఢజేరీ మోడివేసి కోడిపామును వేడుకతొ నాడింపనేరని ॥ఏ॥ జ్ఞానమెరుగక ఈ మానాభిమానములోన బెనగుచు కానరాని కోనజొచ్చి సోముగూడి మేనుమరచి తానుతానై సిద్ధగురుని దలచి తన్మయమందనేరని ॥ఏ॥

నాదనామక్రియరాగము—చాపుతాళము.

మనసు మనసున బెనగి మనసుయేకముజేసి మనసుమర్మముగన్న దెరుకా. కనుచూపులకు నడుమ ఘననాసికము గాలి కదిలిరెండొకటైన దెరుకా అక్షరంబులకాది అక్షరము తాదెలిసి అక్షరము పరియించు టెరుకా అక్షరంబను ప్రణవమాలించి వీనులను అనుదినము వినుటయే యెరుకా ॥మ॥ చీమయొక్కటి కోటి సింహముల దిగమ్రింగ శిఖరమందుండుటేయెరుకా హేమవర్ణము దోమయెనిమిదీ యేనుగుల వేగమున మ్రింగుటేయెరుకా ॥మ॥ వర్గముల కారింటవైపు దెలిసి తనలోను నిర్గుణంబయియున్న దెరుకా దుర్గుణంబుల మూటిగూలద్రోసి తనలొ భర్గుడై ప్రభుగన్న దెరుకా ॥మ॥ కప్పయొక్కటి యైదు పాములను దిగమ్రింగి కాలుదువ్వుచున్న దెరుకా గొప్పముసలిని చేప చప్పరించకమ్రింగి చొప్పణగియున్నదే ఎరుకా ॥మ॥ షట్చక్రములు గడచి నడిమి వాకిలిదెరచి నాగేంద్రులేపినదెరుకా ఇడపింగళలు గడచి ఈ జీవహింసతోకూడి కుంభకమైనదెరుకా మనసు మేఘ

మొరుములు తళుకుమేలైనఝుడివాన యెడతెగక కురిసినదె ॥యె
అరుదైన మాధుర్యమనుభవించుట సుఖములన్నిటిని మరచినదె
యెరుకా ॥మ॥ గంగయమునల నడుమను ఘనమైనమేడలో అం
గనతొ గూడినదె యెరుకా రంగైనరవికోటి కాంతుల కాంతి
యయి మనసిద్ధగురు జేరుటెరుకా ॥మనసు॥

ధన్యాసిరాగము - ఆదితాళము.

మగ్గంబెట్టి నేనేటంచుకు మోక్షంబిది వినరయ్యా భక్తోదే
వ స్వామియనిమగ్గం పదిలపరచితా నేయవలెన్ ॥మగం॥ ఆది
కమలమున గణపతినెప్పుడు అర్చించి పూజలు చేయవలెన్,
పదిలపరచితా బహుపినయంబులు బంధించుమఆసు పెట్టవలెన్
వాద్దికతో విషయంబులనే నూలు చెదరక ఆసు పోయవలెన్
॥మ॥ కామక్రోధ లోభ మోహములను కదలకుండునట్లుకట్టవలెన్
నీమము తప్పక నీమార్గమున నెమ్మదిగా పరుగెత్తవలెన్ మమ
తలు బాసి మాయనురోసి మార్గమనే పడుగు జేయవలెన్ ఏమా
రకను యిరువైయెదిట యెంచిపడుగేది మర్దించవలెన్ ॥మ॥
పూనిగురువాక్యమను కుంచెదీసికొని పొలుపున పడుగు నేయ
వలెన్ ఆంత అష్టమదంబుల నెప్పుడు అంటకుండ అంటెత్త
వలెన్ యెనసిపంచభూతములబట్టి యెనసిపడుగు యెంచవలెన్
పనిబూనిగురుదృష్టి పదిలపరచి లెస్సభావంబనె ఒచ్చుతుక వ
లెన్ ॥మగముబట్టి॥ అలలుసుళ్ళులేని ఆత్మవీధిలో అల్లువేసి
మంటబట్టవలెన్ వెలసి భ్రూయుగమధ్యంబున వదలక మగ్గము
సాచవలెన్ బలిమిగ నాదంబనియెడు మోకున బంధించియు
నేతనుచాచవలెన్ తళుకు తళుకని తళుకున మెరసెడి తాటిం
చి పలక తాటించవలెన్ ॥మ॥ నడినాళంబున నాడికొమ్మున
నడుముగ కండెక్కించవలెన్ కుడియెడమల తిరిగే పవనము

## కాలజ్ఞాన తత్త్వములు.

గురుతు దెలిసి నేత నేయవలెన్ నిండువేడుకతొ పండువెన్నె లలో నిలిచితమంతట యెరుగవలెన్ దండిగ సిద్దగురు అండను జేరి దానియెరిగి దిగనేయవలెన్ ॥మగ్గం॥

నాదనామక్రియరాగము. చాపుతాళము,

జ్ఞానబ్రహ్మానంద యోగ జన్మ కర్మములెడబాపు చిన్మయ యోగి ॥జ్ఞాన॥ చిత్తమనేపట్టణమందు చిన్మయుడనె రాజు రాజ్యము సేయగానుబుద్ధియనె మంత్రితోను పురుషార్థమేమని తలపోయగాను ॥జ్ఞా॥ ఒడలునీళ్ళ తడపనేమి వూపిరిబిగబట్టి యుండాగనేమి జడలుధరింపగ నేమి మాయజాలము జేసితె జన్మపావనమా ॥జ్ఞా॥ బూడిదెబూసితెనేమి ఊర్ధ్వ పుండ్రముబెట్టిన పురుషార్థమేమి మూడుగుణంబులకామి తాముక్తుడు కాకున్న మునిసిద్ధుడౌనా ॥జ్ఞానా॥ ఆదగురుని పట్టవలెరా పదియారు గురునిపట్టి బంధింపవలెరా వేరొక్కటిని తెలియ వలెరా తావెలుగైన తెరచాటు తానిల్వవలెరా ॥గ్నానా॥ తొమ్మిది తూటుల బాటా ఆదికల్మషములకెల్ల దాపైన గూన లక్ష్మిగాదుర గురునాన యిదినాశముజెందును నానావిధాన ॥గ్నానా॥ తొమ్మిదితూట్లు మూసి దొంగలుండెడి చోటెల్ల సాధించితెలిసి తుమ్మెదనాదములెంచి తాను తుల్యమైన స్వానుభవమున నిలుపవలెరా ॥గ్నా॥ సతిపతులిద్దరు గూడిచాల రతిసేయగ శుక్లశోణితమును గూడి సుతుడాయె గర్భమువీడి దానసుఖములేదురా పరికించి చూడ ॥గ్నానా॥ తల్లిదండ్రులు అన్నలు మరితమ్ములు బావలు తగ చుట్టుకొన్న ఎల్లబంధువులున్నను తానుతరలి పొయ్యేవేళ తన కెవ్వరన్నా ॥గ్నా॥ పరబ్రహ్మమే సత్యమౌరా పరమానంద పాసము చేయవలెరా గురుపాదమే చేరవలెరా ధృఢమైన తత్వము తా దెలియవలెరా ॥గ్నానా॥

## కా ల జ్ఞా న త త్త్వ ము లు.

### ధన్యాసిరాగము-ఆదితాళము.

ఎవరని యడిగితె సిగ్గవుచున్నది ఏమనిచెప్పుదువినరయా
నేత్రాకారుడై లోకములోనికి మూత్రపు గవిదాటొస్తినయా ॥ఎ॥
మొట్టమొదట పుట్టివచ్చినవూరు వుచ్చగుంటలో వునికయా ము
ట్టు మైలనే యిరవు జేసుకొని ఇష్టముగా నేనుంటినయా ఎ॥ తల్లి
దండ్రుల ముదమునబుట్టిన తత్త్వర తనువని తెలియరయా తాను
పట్టని దేహములోపల పొట్టలోనె పుట్టి వస్తినయా ।ఎవ॥ శుక్ల
రక్తములు చుట్టుకొన్న యెవరని యడుగ నేనున్నదయా చీము
పులుసు వుచ్చిష్టము రోతలో చుట్టుచవికలో నుంటినయా ॥ఎ॥
బూతుకుపుట్టిస పీతరీబుజ్జిది పాదుజేయయేమున్నదయా పుత్తు తే
పుల చిత్తరి బొమ్మలె పెత్తనగాడై యుంటినయా ॥ఎవ॥ తొమ్మి
దిటికెల మేడలోపల కర్మరహితమైయుంటినయా తమ్మ వీర
లింగంబు సద్గురుని నమ్మి సేవించుచుంటినయా ॥ఎవ।

### నాదనామరాగము-రూపకతాళము

చేతులకందవురుండు శివనీతులు చెప్పంగ విందురటన్నా
చే ఊరిపడమట నొక్క పాములేనిపుట్ట పుట్టలోన యూర పిచ్చి
రట పుట్టమీదనొక్క పూసలవెళ్ళియట పడెడేసివెన్న మెక్కు
నటన్నా ॥చేతు। మొదలులేని మ్రాకు ఆకులేని తీగ తీగకు ఐదు
కొమ్మలట మొగ్గలేనిపిందె తొడిమలేనిపండు నోరులేనిబాల
మ్రింగెనటన్నా ॥చే॥ గుఱ్ఱము యెనుబోతు కూడిచరింపగ బ
ఱ్ఱిడ్లమీద నడచునటా ఱెక్కిపోతుజింక షుట్టిమానుమీద నమ
లక యాబయలు మేమిటన్నా ।చేతు। గురుతుగ యాగంటి
గురుకృప గలిగితే గురుతుగ సంజయ్య తెలుపునట శివుని భక్తు
లయితె శివుని సన్నిధికిని చేరుమని శివుడుతా చెప్పునటన్నా ॥చే॥

 కాలజ్ఞానతత్త్వములు,

యదుకుల కాంభోజిరాగము - ఏకతాళము.

కంటిచూచూ కైవల్యము కన్నులయందు వింటిమయ్యా ప్రణవనాదము పీనులయందు ॥కంటి॥ చూపులో చూడంగాను చిన్మయ రూపమున్నది ఆరూపులోనే బ్రహాండమంత వ్యాపించియున్నది రేపుమాపులేని వెలుగు వెలుగుచున్నాదీ ఆపాపలందె పరమపదము ఒయలైయున్నాది కంటిగుండ్ల రెంటి నడుమ నక్క కూయుచున్నది ఆగుడ్లు త్రిప్పిచూడ పరమ గోప్యమున్నది గవనియొద్ద ముసలియొకతె కావలియున్నది ఆగవని గడచినను ముక్తి కాంత యున్నది ॥కంటి॥ అకులేని మ్రానుమీద కాకియున్నది కాకియున్నది ఆకాకిముక్కులో బంగారమున్నాది బంగరంపు తీగమీద కొంగయున్నది ఆకొంగముక్కులో శివలింగమున్నది ॥కంటి॥ నూతిగట్టుతుదను నొకనాతియున్నది ఆనాతి నెత్తిమీద పెద్దకోతియున్నది కోతినాతిమీద పరంజ్యోతి యున్నది ఆజ్యోతియందే యాగంటీశుడు స్థిరమైయున్నాడు ॥క॥

నాదనామక్రియ -రాగము చాపుతాళము

సంధ్యవార్చే విధము తెలియండి సంధ్య తెలియనివాడు సన్యాసిబ్రహ్మణుండగునా ॥స॥ సంధ్యనిస్సంధ్యలును పొందియునీ లోనేయుండు బందెసందులు మీరపై సంధినుండి ॥స॥ ఆదినీల తోయిద మధ్యస్థాదిసుకళ ఆవియవిద్యుల్లేఖ అనగమరియున్ ॥సం॥ ఆదియనివార శూకాగ్రి సూక్ష్మంబనుట విదితా పో జ్యోతి ఓంకారమాయెన్ ॥సంధ్య॥ ఓమిత్యేకాక్షరం బనిచక్షుల నడుమను జేరవినరాదా చక్షులేమనసు మనసేచక్షువు చంద్రమా మనసోజాత ॥సంధ్య॥ చక్షుః పూర్వో అజాయతయని అనుగత యాగంటి గురుకద ॥సంధ్య॥

## కాలజ్ఞానతత్వములు.

### ఆనంద భైరవిరాగము - ఏకతాళము.

గుట్టుతెలిసి తెలుసు కొనరె గురుతుగాను జాణలారా ॥
బట్టబయటనుండు దీనిభావమెల్లను ॥గుట్టు॥ గండుపిల్లి లోకమె
ల్లా గాలివించి యేలగాను కొండయెలుకలొక్కరెండు కొలువు
జేసెరా అండబాయ చిలుకలయిదు అవిరిగాచు కుండగాను
పండుకోతు లొక్కరెండు ప్రహరితిరిగెర ॥గు॥ ముప్పు ముప్పు
గొడురాలి మూతినొక్క కొడుకు బుట్టి గొప్పకొండలేదు మ్రింగి
గురకపెట్టెరా ఉప్పుచప్పు యనక నొకడు పురికిమింటి కెగి
యగాను కప్పగంతులేచి పులినికరచి చంపెరా ॥గు॥ భువిని నో
రులేని మిడతపులిని మ్రింగెనమ్మదాని వివరమెరిగియొక్కనక్క
వికవిక నవ్వెరా అవిరళముగ తెలిసిజూడ అలవికాదు యెవరి
కయిన తలప యాగంటి గురుడు తానెతెలుపురా గుట్టుతెలిసి
తెలిసికొనరె ॥గు॥

### సావేరిరాగము - త్రిపుట తాళము.

చదివినందుకు మోక్షసాధనంబేది చదువకుండినజనులు
సాధింపలేరా ॥చ॥ సకలంబు బ్రహ్మమని చాటంగ శ్రుతులందు
లోకచోటలేదనుచు వగవంగవలెనా ॥చ॥ గరిమతోడుత హృద
య కమల మధ్యమునందుపరిపూర్ణుడనిమాయ తగులాటలాయెన్
॥చ॥ పరమగురుడేకాంత భావజ్ఞుడై వెలుపడగ పదునాల్గు జ
గజాలములన్ పరమగురుడేకంటి కర్త నందీశ్వరుడు కరుణ
జీవన్ముక్తి గలుగు చేగాక ॥చదివి॥

### మోహనరాగము ఏకతాళము.

కోరి కోరి పరమగురుని కోరిజేరరే కాలకర్మములకు
కడకుజిమ్మరె ॥కోరికోరి॥ కాలిమడమ గుదమునందుగదలకుండ
నెత్తిపట్టి మూలబంధతత్వగతిని మురియుచెప్వరే ॥కోరి॥ కంటి

లోన యింటినడుమ కంటిలోనుకన్ను దెలిసి కంటిపాపవంటి పెన గు ఘనులు యెవ్వరే ॥కోరి॥ ప్రాణ ప్రాణవాయువులను పరగ నైవేద్యంబు జేసి పూనికాయ సిద్ధిహొందెడు పుణ్యులెవ్వరే ॥కోరి॥ మాటలాడక మృతమును మేటి బ్రహ్మరంధ్రమునను మేటి హంసతోను గలసి మెలగుచెవ్వరే ॥కోరి॥ పరమ గురుడేకంటి భవ్యలింగమూర్తికరుణ పరమలింగ సుఖము జెందు ఘనుడు యెవ్వరే ।కోరికోరి।

సావేరి రాగము - ఆటతాళము.

సొగసైన కన్నులచూపు లుడుగక గాని మగువలపొందే ల మానునో అయ్యా తగజిహ్వాచాపల్య తనయుడుడుగక గాని పగల యింద్రియమేల మరలునో అయ్యా ॥సొ॥ పాపనియ్య మోహపాశముడుగక గాని అన్యాయవర్తనమేల అణుగునో అయ్యా ॥సొ॥ మాయవు సంసార మమతలుడుగకగాని కాయసిద్ధు లెట్టు కలుగునోఅయ్యా ॥సొ॥ కామాది గుణదోష కర్మముడుగకగాని పామరభావమేల పాయునోఅయ్యా ॥సొ॥ కొనసాగి యాగంటి గురుని నమ్మకగాని ఘనజన్మఫలమేల కలుగునో అయ్యా ॥సొగ॥

ఇంగ్లీషు వర్ణమెట్టు రాగము - ఆదితాళము.

కంటిపావలనంటరా మూటవాల్గింటరా నాల్గింటి ఐదింట ఆరింట అరసి చూడరా ॥క। యెక్కరాని మానుకొమ్మ నొక్క పండు పండెరా । పండెనని చిక్కిచూని నిలుకలేదు కఱవెరా । పెక్కుచిలుకలాకు పిల్లి నొక్కచోట హొంచెరా హొంచెనని నిక్కిచూచి కుక్కలఱుఱ మొరిగెరా ॥ చోద్యమైన గొఱ్ఱెపిల్లి రాజ్యమంత మేసెరా ॥కం॥ బిఱబమైనపిల్లికూన పెద్దపులిని మ్రింగెరా వీధిలో హొమ్మ యొఱకపిల్ల వీరభద్రుని మ్రింగెనురా చీమలో

గూడుకొని మిద్దెలు మేడలు కట్టెరా మిద్దెమీద కన్యపడుచు పెద్దకూతపెట్టెరా మూగవాడు వేదమెల్ల మొదటనుండి చదివెరా ॥క॥ ఎండనీడ లేనిచోట వుండెవురుములు చూడరా పాము కాటు విషములేక కాటుఅందుట చూడరా మూడు లోకములుయేలు ముసలికోతియొక్కటి చోద్యమైన ఘంటయ్యను దేవుడని నమ్మెరా ॥కం॥

నాదనామక్రియరాగము అటతాళము.

అడిగినప్పుడె చెప్పగూడూనా బ్రహ్మానుభవము ఆత్మానుభవము ఆడిగినప్పుడె చెప్పగూడూనా బ్రహ్మానుభవము ఆత్మానుభవము ఆడిగినప్పుడె చెప్పుటకు నిది పడుచులాటల భ్రాంతజన్యము ఉడిగి నిర్మల మాయనువిడిచి నిలిచిన స్వానుభవమిది ।అ॥ టక్కునగు సంసారజలధిలో ముక్కుముంచక ముసుగక్రిందుగ చిక్కిపొరలు నింద్రియంబుల టక్కరణచియు మున్నుపెద్దలు పెక్కు సంసారములు విడిచెరే మోక్షంబు కొరకై చక్రవర్తులు నగరు విడిచిరే రాజాధిరాజులు మ్రొక్కి గురుని వంచగాచిరే ఋష్యాదులూరక దిక్కుదెలియక శడవికేగిరే నిక్కముగ మోక్షంబుజెందెడు నిలువడొక్కటి లేనియిప్పుడు దక్కినట్టుగమాటలాడ మీదయకు పాత్రులు మన్నమాత్రమె ॥అ। తనువు ధనమున సంపదయులా వెలసియుండి గురుని కొలవక వెనుకవెనుకనుగాదుకొనిరి దినదినంబును జేయక గుణములవి మూడణగిపోవునా జీవేశ్వరులకు గుణములణగెడు తావు తెలియునా ఆదరణములను బెనచుకొనిపై తేలవిచ్చునా అరిషడ్వర్గములను దునకలు పడదన్నకుండునా ఆనయము తద్బోధితంబగు ఆత్మతత్వము నెరుగజాలక శునకముగ తనబుద్ధి దిగక మనసు నిలకడలేనివారికి ॥అ॥ కొంచె గురువు శిష్యవర్గము

గురువు శిష్యవర్గము వెంటతగిలి బాధసేయుచు తుంటమాటలు నేర్చి సాధుల గేలిసేయుచు రంటుకొనిబల్ తంటతగవుల బాధ చేతూరు మీరెంత మీకంటె మేమెయెక్కువంచు గోవింద అజముక్కంటి మాపనివారలందరు ఇటువంటివారలు యింట యింటను యెత్తుకూళ్ళదింటు తమ మనమి వచ్చినట్లుగ కంటు వాదంబులుడుగని కొంటెలకును దుర్మార్గజనులకు ॥అడి॥ బుద్ధి చాలక చేయబోదిపి సిద్ధమగు శ్రీ కంబగిరిని శుద్ధమళ్ళ నరహరిపై బుద్ధి నిలకడలేనివాండ్కి॥అగిగి।

మాయామాళవిరాగము-చాపుతాళము.

రామభజన సేయరాలమిడీకా సీతామసమణచర దగిడీకా ।రా। దూముధాము లేమిజేసి నోముకొన్న ఫలమెకాని తాము తాము తరలిపొయ్యే దారియైతె తెలుసుకోరా ॥రా॥ కండక్రొవ్వు చేతనిట్లు తిండిపోతుల గూడీ వుండబట్టక తిరుగబోతె గండ మేలతప్పునయ్యా ॥రా॥ తల్లిపిల్ల యిల్లువాకిళ్ళెల్ల మాయకల్ల గాని దొరలబోసి యముడుచాల కర్లగొట్టి పొరల చేసును ॥రా। టక్కు పిక్కు లాడిపిచ్చి కుక్కరీతి మొరగవద్దు జక్క లేటి కంబగిరిని చక్కనయ్యనష్టె మ్రొక్కుము ॥రామా॥

సురటరాగము - ఏకతాళము

అదిగో చూడవె మనస ఆత్మలోముక్తి పదిలముగ సాధింపబ్రహ్మంబె తానగును బ్రహ్మ బ్రహ్మంబని బేదించి కొలిచెదరు బ్రహ్మ బ్రహ్మముగాదు పరగంగవినుడి బ్రహ్మ బ్రహ్మంబైతె కుమ్మరాకారమున బొమ్మలను జేసుకొని తానమ్ముకొనునా ॥అది॥ విష్ణు బ్రహ్మంబని యిలయందుకొలిచెదరువిష్ణు బ్రహ్మముకాదు విశ్వంబులోను విష్ణు బ్రహ్మంబయితె కృష్ణావతారమున విటకత్తెలనుగూడి తాకష్టపడునా ।అ॥ శివుడుబ్రహ్మం

సృష్టిలోకొలిచెదరు శివుడు బ్రహ్మముకాదు సిద్ధాంటుగాను శివుడు బ్రహ్మంబై తె శిరముచే ధరించును కాటిలోపలశివుడు కలియ దరిపోనా ॥అ॥ ఆరుమూటినిదాటి మేటి శిఖరముమీద ధీరముగ వెలిగేటి ధీవరేణ్య పదిలముగ పూదోట ప్రభువు వంటి నయపుడె ఘనమైనమోహాబ్ధి కడనీదజడును ॥అ॥

కాఫిరాగము - చాపుతాళము.

అదిరాముక్తికి త్రోవ యదిరా సాధించు పదరా యీబూటకం బొప్పదు నామదికి ॥అ॥ వదలక గురు కొల్వాపలెరా నెర నమ్మి పదపడీలోచూపు చెదరనియ్యకురా ॥అ॥ బొమ్మరింటిలో మంచిసొమ్ము వున్నదిరా ఆసొమ్ముదక్కించుకో నొక సూటియున్నదిరా ॥అ॥ ఆరువాకిళ్ళుమూసి అందురొద వినుచు ఏరులుగూడినచోట యేకాంతమునను ॥అ॥ ధీరతతో చిన్నిదిడ్డి దూరెపవు కారుచీకటిలో కదలకటునిలిచి ॥అ॥ పొంగిపొంద గురుబోధ భూతియెగజల్లి తెలివిచే చీకటికూడ దివ్వెముట్టించి ॥అ॥ తెల తెల తెల్లవారె భానుడుదయించె అలపట్టపగలే చిక్కులు గనిపించె ॥అ॥ చెలరేగి కళలలొ చంద్రుడుదయించె అలవీరపూవోట రామన్న యితడు ॥అ॥

సావేరిరాగము - ఆదితాళము

చెడుగుడాడెనే మారంగయ్య చెడుగుడాడెనే చెడుగుడాడెనే మారంగయ్య చెడుగుడాడెనే ॥చె॥ చెడుగుడు గుడుయని పలికెటి నడుమను పాడినవినబడి ఆటాడను ఏడులోకములు యెదలేకెప్పుడు వాడవాడలో వడిగలవాడె ముడివిడిచి మూడే ద్రింగి ॥చె॥ నాటకవీధిలో నేటుగనొంగ ఆబలాడుచును అటుయిటు ఆవలవృక్షముపై వటపాత్రుండై ధీరుడై జీవలో దివ్య విరాజైన మార్గమున నాటకధారియై చాటును చతురాక్షరిని ద్రింగి

## కా ల జ్ఞా న త త్త్వ ము లు.

॥చె॥ రంగరంగ వైభోగ రంగమున రథాంగుడయి బట్టపయలు
గ బల్గుడుగుడుయది జంఘలు చాచుచు రంగుగ పంచాక్షరి
ని మ్రింగితె అంతాంతకునొక అంతస్థానమున కాంతి కాంతికే
కాంతంబొకట్టె కుంతెనలోల ముకుంటెనకాడై అంటియింద్రియ
సంధానుండై అంటిఅంటకను అత్మలొనతడై యందుషడాక్షరి
నంగిటమ్రింగి ॥చెడు॥ సత్తుచిత్తు సదానందంబై సకలాత్మలలో
సర్వముతానై సర్వశేషియై సర్వేశ్వరుడై సిద్ధులలోపల చిదానం
దుడై శాశ్వతముగ శతకోటి విలాశుడై సతతము సత్యమై
శక్తిసహితుడై అష్టాక్షరిని అంతలోనమ్రింగి ।చె॥ దశనామంబు
ల దశవీధుల దేవేంద్రలోకమున దేహము నిమిడియు దాస
దాస దాసానదాసులకు దాసుడైన విడెప్పదాసునికి ద్వయము
నాంచారుదేవి యిలద్వయ క్రిష్ణవాణితో ద్వైతుండై దేశాదేశాధి
ధీరుడు హరితాసుతాసె తత్వము తత్వము యతిపతి యేకాక్షరి
ని మ్రింగెడు ॥చెడు॥

ధన్యాసిరాగము - ఆదితాళము.

మాయను నరికే మర్మమున్నది న్యాయము వినవే వో
మనసా కాయములోపల వుపాయము కనుగొని మేయవలేన్
పరమే వోమనసా ॥మా॥ అండపిండ బ్రహ్మాండము లన్నియు
కుండలియనవే వోమనసా దండిబావమిది దారిజూపితినిక ముం
డమోపివలెనుండకె మనసా ॥మా॥ చెట్టు యెక్కుటకు గుట్టు తె
ల్పెద పట్టుపట్టవే వోమనసా పట్టువదలకను బ్రహ్మమునీలో
ముట్టివిడువ వలె వోమనసా ॥మా॥ తంటలుమారై కంటిచూపు
లో యంటి చూడవలె వోమనసా కొంటెతనమున యారింటి
విడిచి గురినంటి చూడవే వో మనసా ॥మాయ॥ తిరుపతివెంకట
రమణుడె గురుడని యెఋకమరువకే వోమనసా ధరణిలో నర

## కాలజ్ఞానతత్త్వములు.

సింహదాసుని వాక్యముపరమనివినవే వో మనసా ॥మా॥

ముఖారిరాగము -

నాదంబతి జాగ్రతగా వినుమనసాసాక్షాత్సద్గురు ప్రణవనాదం ॥నాదం॥ సద్గురుబోధం సంస్కృతిబేదంయక్షరబేధందశవిధనాదం బది ఇరుగిరులపైగా నెక్కి వినుమిక్కిలిగా గురుని కీలకమున దక్కి యిదుగురులకును యిష్టదైవమును చిరునగునగుచును చిత్తదృఢంబున పురమునువెడలి పరమునుజేరి సరి గరి గరి గరి హంసోహంబనుచు ॥నాద॥ కంటిపాపను కట్టివేసి కర్మముల జంట పాయక కట్టికోసి కంటిపాపను కిలనుగపెంచి మంటిబొమ్మను మిణుగుగదిద్ది గుంటనక్కను కూయక కట్టి ఘంటానాదము ఘణ ఘణ వూదుచు ॥నా॥ పట్టువిడువక పట్టుబట్టి పక్వము తోడను పిట్టను బట్టి బిగియకట్టి పట్టువిడువక పరమహంసను తిత్తికట్టిక తయ్యనిఫలములు చెట్టుపైగను చేరిచరించుచు దిట్టముగా యిల ధింధింయనగా ॥నా॥ ధరను ఘటికాద్రియందునిలిచియున్న మహాత్ముడయిన హరినిపుదివి దలచి ధరలో ధగధగ మెరయుచు ముక్తిని సురలుమెచ్చ యీ నరలోకంబున చెలికుపాలు చెల్ చెల్ మనగను నరసింహదాసుని చేరిభజించి ॥నా॥

మాయామాళవి రాగము - ఏకతాళము.

హరిఓం హరిఓం అనరా ఆదిబ్రహ్మమేగనరా హరిఓం హరిఓం అవిఘ్నమస్తుశివాయ గురుఓం హరిహరియనరా అంతర్మయమున గనరా ॥హ॥ అయిదక్షరములుయనరా అంతర్మయమున అల్పితే బ్రహ్మము ఆద్యంతమైజ్యోతిరూపమై రూపమందున సూక్ష్మమువెలుగై నాదుబిందులై ఒకటై రెండై మూడై నాలుగై అయిదై ఆరై ఆరింటిలో ఆడుచుపాడుచు ఆత్మరూపును అందము గనుగొని ॥హరి॥ శంఖచక్రములు గనరా అష్టాంగ

## కా ల జ్ఞా న త త్త్వ ము లు.

యోగములు విడరా శంఖచక్రమున శాస్త్రములారై ఆరిం టిలో ఆకాశంబై అష్టభుజంబులు సృష్టికర్తయై తిరిలోకమందు దేవతలై దై ఐదులైదు లిరువైయైదింటిలో అకార వుకారములు రెంటిని విడిచి మకారమందున యెక్కిచూచుకొని ఓంకారం బును ఒకటిగ నిలిచి ॥హరి॥ అకారబంధము వినరా ఓంకా రము బీజముగనరా అకారోంకారముల రెంటిని విడిచి అయిదక్ష రములు హరినారాయణ యని అంగములోపల లింగము గను గొనిలింగమందున నిలిచియుండినగురునిత్యముసత్యమునిజమనిన మ్మి సద్గుణంబుల సత్యవంతుడై సర్వమందున చిన్మయరూపమై చిన్మయ రూపముజేరి శివాయని ॥హరి॥ దండి గురువులనుగనతా సామాన్యము కఠినంబిదిరా దండిగ గురుడే యితండు తేజమని కుండలి వాకిలి కోటదాటిహరి ఆరుదళంబులు అష్టాక్షరియై అక్ష రమందున అఖండ రూపమై రూపనామములు రెండును విడిచి సుందరనాధుని సూక్ష్మముగనుగొని సూక్ష్మమందున చూపును నిలిపి కంటిబొమ్మను కలసిజూచుకొని గురువేమన్నను మదిని నిలుపుకొని నరసింహదాసుని నమ్మినిలిచినీవే ॥హరి॥

నాదనామక్రియరాగము - ఏకతాళము.

కుక్కనుబట్టగవలెరా జీవా కుక్కనుబట్టగ వలెరా, కుక్కనుబట్టె పక్వమున్నది ముక్కుబగట్టర ఓరన్నా కొక్కర కోయని కోడికూసెను అక్కర్లపడితా వీరన్నా ॥కుక్క॥ కొండ ముచ్చువలె కొంతసేపుతా నిండియుండును ఓరన్నా నిండియు న్నదని యెడబాసియుండిన కొండలెక్కిదిగునోరన్నా ॥కు॥ పట్టు విడిచిన పెద్దలకెల్లను పట్టుసాధన వోరన్నా గట్టిగనమ్ముచు ఘట మున పొర్లుచు పొట్టపేగులో వోరన్నా ॥కు॥ అంతర్మధ్యాకాశ మందున పంతములాడు వోరన్నా ఇంతకు చూడ శక్యము

యెంతమాత్రమిది కాదన్న ॥కుక్క॥ తిరుపతి వరగిరి తేజరూపు ని తరిమిపట్టరా ఓరన్నా ధరలో నరసింహదాసుని శరణని గురు ని యెరుగరా ఓరన్నా ॥కుక్క॥

ధన్యాసిరాగము - చాపుతాళము.

కామముమరచే నీమమున్నది రామరామయను ఓమనసా ప్రేమతో సద్గురు వేనవు చిన్మయనామము నమ్మవే వోమనసా ॥కా॥ నీవు నేను అను బహువచనార్థముల తావుతెలియవే ఓమన సా దేవుడైన పరమాత్ముడే నిరంజన దేవునెరుగవే ఓమనసా ॥కా॥ ధన ధాన్యంబుల దలచగ నేటికి ఘనముగాదె చీ విఋమ నసా మానక ఆత్మధ్యానమె మనకు మాపైయున్నది ఓమనసా ॥కా॥ గురునిగూడినదా నాడులందిరుగుచు స్మరణ జేయవె ఓ మ నసా ॥కా॥ తరచుగ నీవును తన్మయమందుచు వెలువకనిలువ వె ఓమనసా ॥కా॥ ధరణిలో చిత్తూరు పురమున కరిగి వరదుని గోరవె ఓ మనసా ॥కా॥

ముఖారి రాగము - ఏకతాళము.

జీవమా మాయాజీవమా జీవమా మాయాజీవమా ॥ జీవమా నీకెంతదెలిపిన త్రోవతెలిసి నడువవేమి కావరము అ ణచి సద్గురు భావమందు నిలువవేమి ॥జీవ॥ అశలనే అహము విడిచి యాశతో శ్రీరామభజన నాసికాగ్రమునజేరి దాశరథి య నవె హీన ॥జీ॥ నీతమార్గములను వెదకి నీయవస్థలన్ని విడిచి వాశ్రిత ఫలము తెలిసికొని వాక్కుమూసి ధ్యానమాడవే ॥జీవ॥ ధరణిపై శ్రీ నరహరి మాపురేపు యొక్కటిగ నాదుబిందు కళ లయందు నాట్యము దొక్కంగరాద ॥జీవ॥ తిరుపతి మాంపాహి వేంకట గుడుని గోప్యముగ ధరణిలో నరసింహదాసుని పరమ చిత్త దృఢముజేసి ॥జీవమా॥

## కాలజ్ఞానతత్త్వములు.

### నాదనామక్రియరాగము-చాపుతాళము.

మాయను నరికినవాడు గురురాయునితో జతగూడు పా యుచు విషయము రోయుచు సతతము యేయెడచూచిన యేక ము దానై కుండలినటుబేదించి అఖండముగను భావించి అండ పిండ బ్రహ్మాండమున తట నిండిపండియా నిర్వికల్పమున ॥మా॥ మూడారువాకిళ్ళమూసి ఆమూలకవాటము దీసి ఇడాపింగళ జో డు జోడుకొని మూడుగడచి ఆమూలలముతానై మాయా ఆధా రమున రేచించి మణి పూరకము కుంభించి కోరిన కోరికల ని వారణ జేసెను నారాయణ గురు పారాయణచే మాయనునరికిన వాడు ॥మాయ॥

### నాదనామక్రియరాగము-ఏకతాళము.

ఆనందమయుడుగావలెను పూనితానుతానై యున్న తావు గనవలెను ॥ఆనం॥ కామము కడకొత్తవలెను అష్టసామజముల మనము సయింప వలెను. ॥ఆనం॥ ప్రేమసద్గురు జేరవలెను దుష్ట తామసపు దుర్గుణములు తొలగింపవలెను ॥ఆ॥ సత్యమే మది ని ల్పవలెను అసత్య దేహముమీద ఆశ విడువ వలెను భక్తిమది లో నిల్పవలెను జీవన్ముక్తిమార్గము తాముందెరుగ వలెను ॥ఆ నం॥ అక్షరాత్మకుడు కావలెను మూడక్షరంబుల భావమదితెలియ వలెను దీక్షాధికారి కావలెను మోక్షకాంక్షచే తను సద్గురు జేరవ లెను ॥ఆ॥ నిద్రరాకడ తెలియవలెను దాని భద్రపరచుక యోగ నిద్ర బొందవలెను చిద్రూపమిపుడె కనవలెను ఖేచరీముద్ర కీలెరి గి సద్గతి బొందవలెను ॥ఆనం॥ వేషభాషలు మానవలెను తన్ను దూషించినవారిని భూషింపవలెను కాషాయధరుడు కావలెను నాద ఘోషము వీనులయందు ఘోషింపవలెను ॥ఆ॥ చూపు మనసొక టి చేయవలెను సర్వవ్యాపకుండై చిన్మయాత్మగన

వలెను మేడమీదికి జేరవలెను అట జోడువాయక హంస జూడగవలెను ॥అనం॥

సావేరిరాగము - ఆటతాళము.

అన్నమే బ్రహ్మమేరా జీవునకాధారంబనరా అన్న బ్రహ్మము అదిస్వరాట్టు యెన్నరాని పరమేకముతానై ॥ఆ॥ ఆదియనాదిరా అన్నము ఆపోజ్యోతిరా ఆదిబిందువై అమనస్కంబై ఆదిమధ్యాంతమున అంతరాత్మయై ॥అ॥ మూడుగుణంబులురా అన్నము మోదముతో గనరా మూడుమూలమై ముక్తిపదంబై మూటినిల్కడమూలముతానై ॥అన్న॥ చతుర్వర్ణము అన్నము శ్వేత దీపమురా కాంతారూపమై శివమై చతుర్వక్త్రుడై చతురాక్షరియై ॥అన్న॥ నాదము వినబడురా నారాయణ గురుడురాఆదిమూర్తియై అఖిలాండంబై ఆధారంబున అక్షరరూపము॥అ

నాదనామక్రియరాగము - ఏకతాళము.

అంతా చిన్మయం అఖండమద్వయం ఆనందో బ్రహ్మనందం వింతగాను అనుభవమంతయు దెలిసిన అంతరాత్మను చింతసేయవె ॥అ॥ స్థూలసూక్ష్మములు తానై సుకరంబై సుసేవ్యంబై ఫాలభాగమున బహుగోప్యంబై పావనమై ప్రత్యక్ష కరంబై మూలబ్రహ్మమై ముక్తిపదంబై మూటిమూటిమూడావల తానై కార్యకారణంబై కాలాతీతమైన కళకుమించి చిత్కళలు వెలుంగుచు ॥అం॥ పంచబ్రహ్మమై పంచాక్షరమై ప్రణవంబై పంచ పంచ యిరువది అయిదులుతానై పంచవాక్యములు అంగశూన్యములు అంచితముగ అభిమానముతానయి ॥అం॥ రక్త శ్వేత నిరాకారంబై రమ్యంబయి ధూమకృతియై ముక్తికమలమున మూర్తి త్రయముగ ముదమునజూచెడి ముగ్గురిలోశక్తిహితమై

## కాలజ్ఞానతత్త్వములు.

శివమయి పరమశాంతంబై షడ్భావంబై వ్యక్తంబై వేదాంతసారమై వెలుగులోపల వెలుగుచున్నది ॥అ॥ ఏటికి యూరక భ్రమ చెందెదరు యెరుగరు తనలో నుండగను నాటకధారుడు నారాయణుడై కోటిసూర్యకాంతులతో వెలుగుచు అంతాచిన్మయం

ధన్యాసిరాగము - ఆదితాళము.

మోసపోకామూఢాసలునమ్మక మొదటనే కోసివేయవలెరా దేశములో పరదేశుడుండేవాసి తెలియవలెరా శేషశాయి పాదారవిందములు సేవింపవలెరా మాసినముత్యము వలెనే మురియుచుండవలెరా భక్తితోడ తనభావములో భక్తులకావలెరా శక్తిమాయలకు చిక్కకదృఢచిత్తుడుగావలెరా ॥మో॥ పిండాండంబును బ్రహ్మాండంబును పెనగిచూడవలెరా ఉండెడితారకమండలమందున తానునికిసేయవలెరా నిండి యేకమైయుండిన బనమదినీకు సేయవలెరా పండువెన్నెలై ప్రబలేటి తేజముల బయట చూడవలెరా ॥మో॥ గాఢాంధంబున రేయుంబగలును కలసి చూడవలెరా వాదేవాడై యుండిన ఘన శ్రీనివాసు నెరుగవలెరా సుద్యుక్తుండై విషయేంద్రియంబుల పూరకుండవలెరా నిద్రాహారము విడిచి ఖేచరిముద్ర తెలియవలెరా ॥మో॥ నిద్రలో ఘనభద్రమైనముద్ర తెలియవలెరా చిద్రూపంబున గలిగేజీవుని చిత్తు తెలియవలెరా ఉచ్ఛ్వాసనిశ్వాసంబులు విడిచే వుపము తెలియవలెరా బుస్సునవిసరే యసురగాలిలో భేరీపినగవలెరా ॥మో॥

ఆనందభైరవిరాగము - ఆదితాళము.

యోగమిదిరా యానంద భోగమిదిరా యోగమిదిరా యానందభోగమిదిరా చూపుచూచితె సుఖముపుట్టును చూపు

చూడర సుప్రసన్నుడ చూపుచూడక గూడకామరి లోపలదీపంబు గనరా ॥యో॥ బయలు జూడర భావమునను బయలు బ్రహ్మము బాయవద్దుర బయలు బయలు యేకమయితె పరమపురుషుడు తానే రా ॥యో॥ ధీరుడగు చటికాని పురము దేవదేవుని రూపమిదేరా॥ కోరి వెలసిన జనులకెల్లా యిహపర సుఖంబు గలదురా ॥యో॥

నామనామక్రియరాగము - చాపుతాళము.

సత్తుచిదానందయోగి చిత్తంతా భదస్రి చిన్మయ యోగి ॥స॥ చిత్తమనే పట్ణమందు చిన్మయుడనే రాజు రాజ్యమువేయగాను బుద్ధియనే మంత్రితోను యెట్టిపురుషార్ధమును తలపోయవలెను ॥స భూతిని పూసితెనేమి యిట్లు పూర్ధ్వపుండ్రముబెట్టిన పురుషార్ధ మేమి మూడుగుణంబులకామి యిట్లు మూర్ఖుడవైతేమి మునిసిద్ధుడౌనా ॥స॥ ఒడలు నీళ్ళదడుపనేమి యిట్లు ఒడలు నీళ్ళదడిపి వూపిరి బిగబట్టనేమి ఒడలు ధరించితె నేమి యిట్లు జడలు ధరించితె జన్మపావనమా ॥స॥ భూమిలోపల నొక్కచెట్టు అది పుట్టినప్పటినుండి భోగాలపట్టు కామక్రోధంబునబుట్టు అది కాంక్షింప భవరోగములకాటపట్టు ॥స॥ తొమ్మిది తూటులబాన ఆదికల్మషంబుల కెల్లకాపైనగూనా నమ్మరాదురా గురునాన అది నాశంబు జెందును నానావిధానా ॥స॥ సతిపతులిద్దరుగూడి ప్రేమతో రతిసేయ శుక్లశోణితములుగూడి సుతుడాయె గర్భమువీడి దీన సుఖములేదురా దానివిడిచిపెట్టరా ॥స॥ తొమ్మిది వాకిళ్ళుమూసి దొంగలుండే చోటెల్ల శోధించి తుమ్మెదనాదము వినుచు తుర్యమైన సమాధిలో నిల్వవలెరా ॥స॥ ఆరుగురుని పట్టవలెరా పదియారుగురుని పట్టిబంధించ వలెరా వేరొక్కటని తెలియ

వలెరా తాను నెలవైనయాచోట తానిల్వవలెరా ॥స॥ తల్లిదం
డ్రు లెందరున్న యిట్లుతమ్ములు బావలు తగచుట్టుకొన్న యెల్ల
బంధువు లెందరున్న తాను తర్లి పొయ్యేవేళ తనకెవ్వరిన్న ॥స॥

ముఖారిరాగము - చాపుతాళము.

ఎన్నిజన్మములెత్తి ఎన్నితపములు చేసి ఈజన్మమెత్తితివి
మనసా ఎన్నివిధములనైన నీరూపమున గురుని యెడబాయ
కుండవే మనసా చదువులన్ని చదివి సన్యాసిమార్గమున సంచ
రించగ నేల మనసా చదువులో తత్వసారంబు తీసుకొని సందే
హములు మానుమనసా ॥ఎన్ని॥ అక్షరంబులు నాల్గుకుక్షిలో నుం
చుకొని అక్షరంబెరుగవేమనసా అక్షరంబుల గురుని క్షేత్రమున
జేరి సాక్షివై యుండవే మనసా ॥ఎన్ని॥ ఒనరుగా భ్రూమధ్య వా
సిగా జేరుకొని వాదములు మానవె మనసా ॥ఎన్ని॥ కలకాలమా
త్మఖేచరి ముద్ర కీలను దెలిసి యుండుమనసా కీలుచదువులలోను
కాఖాలు గుణియింప కరకంరుని జూచిమనసా ॥ఎన్ని॥ తల్లి గర్భ
మునందు తొల్లిచదివిన చదువు మరల చదువ వలెనీవుమనసా
తల్లడము పడబోక తత్వాలు గుణియించి తత్వంబు తెలియవే
మనసా ॥ఎ॥ ఎనిమిదిజగములను యెగతోలి వేగమున వేద
ములు బాడవేమనసా ఏమరక నెప్పుడు యరలవలు గుణియిం
చి యెఱ్ఱి యేనుగు నెక్కుమనసా ॥ఎ॥ కొండలేడునుదాటి కం
డలీ యగ్రమున అండబాయకనుండుమనసా కొండలారాయడు
కోర్కె లిచ్చెనంటెవుండి శ్రీగురు జేరుమనసా ॥ఎ॥

పున్నాగవరాళిరాగము - చాపుతాళము.

బయలే భావనసేయరా బ్రహ్మానంద బయలే బాయక
వుండరా బయలే భావనసేయ బ్రహ్మానదంబాయె భయభక్తి

సద్గురుని పాదములేనమ్మి ॥బ॥ రెంటిని బిగబట్టరా బిగియబట్టి మింటమనసుబెట్టరా జంటరేకులమధ్యసారముగనుసట్టి ఘంటనాదము చెవి నంటికోరిక యేలరా ॥బ॥ గుండుమీదికి జేరరా మీదికి జేరి చండభానుని మీరర సిండపున్నమనాడు పండువెన్నెలబైట అండబాయక సచ్చిదానందమును జెందరా ॥బ॥ సహజానందము చెందరా ఆనందమొంది సరసిజాక్షుని బొందరా మహిమతో యే ప్రొద్దుమా చినగోపాల విహితముతోడుత వెలయు తారకయోగిరా ॥బయ॥

ధన్యాసిరాగము - ఆదితాళము.

గురువుపదేశం బాయెగదా ఇకపురాకృతంబులులేవు గదా పరమయని వరామా లొసగుచు శ్రీరాముడు తనకరము నుంచెను ॥గు॥ పరాకువలదని చరాచలమునొక సరిగా గనుమని స్థిరము జేసెను ॥గు॥ అరటివంటి ఆరాటమదచియు విరాట్టు దెల్పే స్వరాట్టుడగుమన ॥గు॥ ధరను గుత్తి కొండ పురాన వెలసి నరులబ్రోచెడు మురారి యగుశ్రీ ॥గురు॥

మాయామాళవిరాగము - చాపుతాళము.

ఇదిగోర గురుకీలకం జీవవినరా అల్లదిగోర యోగసాధనము ॥ఇ॥. ఇదిగోర శ్రీగురు పదద్వంద్వములు నీహృదయము లోపల వదలక దలచితె ॥ఇ॥ కొండమీద పెద్దగుండన్నదిరా గుండులోనసన్న గండియున్నదిరా ఆగండిలో నొకపండు పండియున్నదిరా ఆపండు అనుభవించితె ప్రజ్ఞానబ్రహ్మమురా ॥ఇ॥ ధాత్రిలోన నొక్క గ్రామమున్నదిర గాత్రమునకు చిన్మయ నేత్రమున్నదిరా నేత్రమందున గురుని సూత్రము దెలిసి పాత్రమెరిగితేను బ్రహ్మాస్మియవుర శౌ చూపులోను నీలరూపమున్నదిర రూపములో నొకదీపమున్నదిర దీపములోనున్న తేజస్సుగలిగితే

పాపము లణగి తత్వమసియపుర ॥ఇ॥ అయిదైదుల యిర్వై అయిదయి యున్నదిర ఐదింటిమీదను ఆత్మయున్నదిర ఆఆత్మ ను సోధించి అమృతముసేవించి అనుభవమెరిగితె అయమాత్మ బ్రహ్మమిర ॥ఇ॥ గురువాక్యములునాల్గు గురుతెరుగ వలెరా గురుతెరిగినంతనే పరముతానౌరా పరశురాముని నరసింహయోగికి పరము బట్టబయలై యున్నదిర ॥ఇ॥

బేగడరాగము – త్రిపుటతాళము.

నిండుపున్నమనాడు పండువెన్నెలబైట నిండియున్నది యేమిర సద్గురుదేవా రెండు మూసియునే భూమండలమునజూడ దండిబాటయునుండుర సద్గురుదేవా ॥నిం॥ కొండతుమ్మెదలైదు రొదలు చేయుచున్నవి నదులవలననుండి సద్గురుదేవా ॥ని॥ చూపులో శివపురచూపుచూచినయపుడే దీపకాంతులు యేమిర సద్గురుదేవా ॥నిండు॥

కల్యాణిరాగము - త్రిపుటతాళము.

పొందుగను సమాధిలో బయలంది సుఖమునుజెందర ముందుగా గురుబోధచే ఆనందమున చెలువొందర ॥పొం॥ రెండు త్రోవలు మూసి వాయువు రేచకంబొనరింపర కుండలిని భేదించినంతట కుంభకంబొనరింపరా ॥పొ॥ మూటికవ్వల త్రికూట మధ్యను సూటిబెట్టుక జూడర సూటిగానచ్చోటనీవు పగటిచుక్కను గాంచర ॥పొ॥ ఆరుచక్రిములరసి సూక్ష్మద్వారమార్గము చేరర • చేరువగు పదియారింటను తగ పూరకంబొనరింపరా ॥పొ॥ మేలిమిగ శివపుర విహారుని మూలమిదియని తెలియర నీలతోయద మధ్యమందున నిజమునీవై వెలయరా ॥పొందు॥

కల్యాణిరాగము – త్రిపుటతాళము.

చేరెడు నీళ్ళకు భూమెల్ల దడిసెను తెలుసుకోరె యిరవుగ

## కాలజ్ఞానతత్త్వములు.

జనులకు యనుపమంబపమాయె తెలుసుకోరె చింతమానుమీద చేమంతి పువ్వుపూనె తెలుసుకోరె దానిచెంతనున్నకోతి పులిపిల్లనీసెను తెలుసుకోరె ॥చే॥ మూడుమూలల పెట్టె మూసతీసే నేర్పు తెలుసుకోరె ఆమూత దీసితె పెద్దభూతము కనపడును తెలుసుకోరె ॥చే॥ అంబుల పొదిలోను కొమ్మఏనుగుబుట్టె తెలుసుకోరె ఆకొమ్మఏనుగుమీద కురుచబాలుడుపుట్టె తెలుసుకోరె ॥చే॥ అమ్మమ్మయొకకప్ప అయదు పాములు మ్రింగె తెలుసు కోరె దాని ఒడినిండ నిప్పులు పసంతమాడెను తెలుసుకోరె ॥చే॥ గుడిమీద నొకకుక్క కూతలు బెట్టెను తెలుసుకోరె దానిమెడనుండె ఘంటలు మ్రోతలు మోసెను తెలుసుకోరె ॥చే॥ తెలియనివారికి యేడాది గడువిస్తి తెలుసుకోరె దీనిఅన్వయంబు దూరీ ఆదికేశవులెరుగు తెలుసుకోరె ॥చే॥

మధ్యమావతిరాగము - చాపుతాళము.

ఉన్నాడమ్మా చిన్మయ ప్రభువు వున్నాడమ్మా వున్నాడు నిజముగ నుపము తెలిసిజూడ కన్నచోటనే ముక్తికాంతతో వెలుగుచు ఎనుబదినాలుగు లక్షల జీవరాసులయందు నాటకధారుడై నటన సల్పెడు ప్రభువు శుద్ధసింహాసన మధ్య నేత్రర్లక్ష్యము ద్రద్వాదళ పద్మము మధ్య దివ్యమైవెలుగుచు ॥ఉ॥ చూపురూపునంటి చూటచూడగనింత చూపు చూచెడిచోట చోద్యమై వెలుగుచు ॥ఉ॥ ఆరుచక్రములపై ఆగ్నేయమందున్న మేరుశిఖరమునందు తాండవక్రిష్ణుడు ॥ఉ॥ మూడుమూర్తులకాది మూలమైన వీరాస్వామిచే యుపదేశమందినవారికి ॥ఉ॥

కళ్యాణిరాగము - చాపుతాళము.

మొదలుమీదుగ తలలు క్రిందుగ మొలచియున్నది

## కా ల జ్ఞా న త త్త్వ ము లు.

వృక్షము మోదమలరగ మింటిమీదను మదగజము విహరిం
చెగి చిదిమిపట్టిన జంటుకై వడిచీమయేనుగు మ్రింగెరా సద
యుడా మళలూరి వీరరాఘవ సార్వభౌమ దయానిధే ॥మొ॥ చిం
తబుట్టిన రాతిమీదను చింతమానొక టాయెరా అంతలోనె
దాసిలోను చేమంతి పూవులు పూసెరా పంతమాడుచు కప్ప
యొక్కటి పాములైదిటి మ్రింగెరా వింతగాను నిజము మళలూ
రి వీరరాఘవ దయానిదే ॥మొ॥ విఱ్ఱివీగుచు కేకవేయుచు యీ
గ మంచమ్ము మింగెరా గొఱ్ఱె యొక్కటి యైదు పులులను గొ
ట్టి నెత్తురు త్రాగెరా చిఱ్ఱిచెట్టున జాజిపూవులు శ్రీకరంబుగ పూ
సెరా మఱ్ఱిపై కదళీఫలంబులు మళలూరి రామదయానిధే ॥మొ॥
కొంచెమౌ నొకగృహాములోపల కోటిసింహాము లుండెరా అంచి
తముగా నన్నిటిని యొకసామజము వధియించెరా పంచవన్నె
చిలుకలైదొక పర్వతమును భక్షించెర మంచితత్వజ్ఞాన మిది మ
ళలూరి రామదయానిదే ॥మొ॥ ఒంటిపాటున రెండుకోతులు జంట
పిల్లలు నీనెరా కంటివని యొక కుక్కకడుపున కామధేనువు పుట్టె
రా వింటివనియొకమకరినవ్వుచు వీధిపరువులుబారెర జంటనీతెలి
య.గ మంగుళూరి సార్వబౌమదయానిదే॥ మొ॥మానసంబునమను
జుడొక్కడు మానునములుచుండెర కానికాసిమ్మనుచు దోమలొకన
కగిరిఁదలించెర పేనుయొకయోజనముపుట్టెను గరికవీపున మోసె
ర దీనజనమందార మళలూరిదివ్యరామదయానిధె। మొ। కన్ను గా
నక పేపయొకటి కార్ముకంబున నడిచెర మిన్నునేలనియనక పిసరి
మ్రింగిగంతు వేసెర చిన్నబాలుడు సర్పవాచ్యుడు దీర్చియాకొని
పోసెరా అన్నరో యన్నమూర్తి మళలూరి దివ్యరామదయానిధే॥
మొ॥ పువ్వుమీద మహానుభావుడు విజయుకవి యమరేంద్రుండు

వరుసతోదీని తెలిసినవారె యష్టావధానులు నిరుపమాంబుధి చం
ద్రకళలూరి వీరరాఘవ దయానిదే॥ మొదలుమీదుగ॥

ముఖారిరాగము - చాపుతాళము.

ఊధుచు కొలిమితిత్తుల సమరసము తెలియవలెరా వాద
బేదములణచి యాత్మలో శోధింపగవలెరా ఒకటి మొదలు వృక్ష
ము లెక్కకు మిక్కిలు కొమ్మలురా ఎక్కిచూచితె యెంతో పొ
డుగా కాశమంటినదిరా చొక్కమైనపండొక్క కొమ్మను చేతి
కి చిక్కదురా ఒప్పుగ తెలిసినవారికి పడుయొద్దనే యున్నది
రా ॥ఊ॥ రెండుత్రోవలు కూడిన చోటు రేవు యొక్కటేరా
వెండిరేకుల పద్మములోపల అఖండతేజమురా వుండజూచుకొ
ని వునికి తెలుసుకొని యెక్కబెట్టవలెరా పండువెన్నెలనగా
యేడు కొండలకేగునుర ॥ఊదు॥ మూడుయొకటిగా జేసేటందు
కు మూలంబిదిగోర కూడకటను అందు యెరుకనె తాడొకటు
న్నదిరా మూడురేవులు కూడినచోట ముదితయున్నదిర షోడక
తొ సతిపతి రమియించె మేడొకటున్నదిరా ॥ఊ॥ నాలుగుపదము
ల నాణ్యము తెలిసే నమ్మికయున్నదిరా నాలుగారు తలలో యి
రువైనాలుగు యొకచేర మూలంబదిగొ సాంఖ్యతారకా మన
స్క భావమురి వాలాయము శోధించి చూడక వశము గాదు గ
దరా ॥ఊ॥ పంచభూతములు పంచవికారము పదిలపరచవలెరా
మించిన దురితము లార్చి మొటటికి త్రుంచివేయవలెర పంచాక్షర
ములు భావములోపల పఠియింపగవలెరా పొంచి మహమ్మదుసేన్
గురుని పాదము గనవలెరా ॥ఊదుచు॥

వాదనామక్రియరాగము - ఆటతాళము.

కారణగురువెదుక తిరుగ జన్మములేదు గురు కరుణబడయ

[12] కా ం జ్ఞానతత్త్వములు.

చిలుకా గురుకరుణ బడసితేయది మహామధురమై రమ్యమై యుండునే చిలుకా మనసాటివారెల్ల మనలచూడగలేక మట్టిపా లైనారె చిలుకా మనము ఆటలుమాని మనము సద్గురు వెదకి ప రమాత్మ తెలియవే చిలుకా ॥కా॥ కాలయముడు మనకు పొ రుగింటివాడనుచు కలకాలము దెలియు చిలుకా కలకాలము దెలి సిన కళల నంటిగురుని కంటినడుమను జూడు చిలుకా ॥కా॥ ఫాల లోచనుడందు లీనుడై యున్నాడు నిజమని నమ్మవే చిలుకా మూ లకోనలోని మహమ్మాయియున్నది అదితెలియవేనీవు చిలుకా ॥కా॥ రెండునొక్కటిచేసి రేచించి హంసను దండిగా గురిగనవే చిలుకా దండిగా సద్గురుడు కుండలిపైనున్నాడు పండువెన్నెల న డుమ చిలుకా ఆలుబిడ్డల విడిచి యాకాశతీతుని యచ్చోట చూడ వే చిలుకా ॥కా॥ వదలకను గురుసేవ పదిలముగ జేసితే అది నీకు తెలియునే చిలుకా అదినీకు తెలిసితే మదియాత్మ గురుని ఆది పురుషుని గలయు మనసా గర్వపడకను నీవు నిర్మాణ పు రమందున సర్వేశ్వరునిచూడు చిలుకా మనరామబ్రహ్మము గురు డు రమ్యమైయున్నాడు అతని తెలియవే రామచిలుకా ॥కా॥

సావేరిరాగము - ఏకతాళము.

భాంచేతు నేనెంతో చెప్పిన చంచలముడుగవు ఛీ తూ మ నసా మంచిగురుని సేవించిదావుయిక సందుతెలిసి భజియించవె దుత్తెరి మనసా ॥భా॥ పొంచిపొంచి బహుమంచి గురుని గృహము పంచచేరవేటిరవా దుత్తెరిభాంచే ॥భాం॥ బొమ్మలాటంటను తెలియ క తంటలు జేసేతుంటవు దుత్తెరిమనసా ॥భా॥ పట్టుగ నున్నపు గుంట రాఘవులపట్టువిడువకవే ఛీఛీలుచ్ఛా ॥భాంచేతు॥

## కా ల జ్ఞా న త త్త్వ ము లు.

### యమునాకళ్యాణి - రాగము - ఆదితాళము

ఊరికిపోవలెరా పరబయలూరికి పోవలెరా ఊరికిపోవలెరా దారితెలుసుకొని మేరుశిఖరమున వెలిగేటితావుకు ॥ఊ॥ యేడుకొండలెక్కి నడుమన మూడుయేర్లుధాటి, వేడుకకనుగొని గూడిన నడులను కూరిమితో నాగ్గురునివిడిచి ॥ఊ॥ సన్నదిడ్డిదూరి పున్నమవెన్నెలబయలులలో, కన్నవారినికనుగొని పోవలెతిన్నగ సన్నపుదారి తెలుసుకొని॥ఊ॥ కంటి లోవెదకినను కానక మింటిలో వెదకినను, కంటికిమింటికి రెండికినడుమనుయొంటిగ చీకటి యింటిలోకనుగొని॥ఊ॥ జోడుపాములుండు చూడగపరుగులెత్తియాడు, కోడెగాడు మణిమంత్రముగ్రోలుచునాడుచు కన్నులజాడలు కనుగొని॥ఊ॥ పంచకోశములను తనలో నెంచిచూడగాను, సంచితమిది శ్రీవేంకటగురుకృప తెలుసుకపోరా హంసనుగూడి॥

### పున్నాగవరాళి రాగము - చాపుతాళము

ఎక్కడాతిరిగినలేదురా జీవన్ముక్తి తనలో తన్మయమందిచూడరా యెక్కడతిరిగిన లేదుతనలోతాను మనసుచెదరక, దిఃకరించిచూపులోపల మక్కువతో మనసునిలుపక ॥ఎ॥ ఆరుమూడు యేడు తొమ్మిది యెనిమిది పండ్రెండునాలుగుకమలముల మధ్యమందు గురునికంటిబొమ్మను కలసికూడుక ॥ఎ॥ పదియు యిరువదియైదు ముప్పైయారు తత్వజ్ఞానమంకమలముల మధ్యను గురుతుజేర్చి కంటిబొమ్మను కలసి జూడ ॥ఎ॥ వూరివాకిట కూతలాయె వినగ వినగ వింతలాయె దాసుడేని వాసుడాయె బాలకృష్ణ లీలలాయె ॥ఎక్కడా॥

## కాలజ్ఞానతత్త్వములు.

### తోడిరాగము - ఆదితాళము.

కొలువైయున్నాడే సద్గురుమూర్తి కొలువైయున్నాడే కొలువైయున్నాడు కోటిసూర్యులకాంతి మేలైన భ్రూమధ్య మే డలోపలతాను ॥కొ॥ లలనరో వినవే సద్గురుమూర్తి అంగన వి నవే ముల్లోకములకాది ముక్తికారణమతడు పల్లవపాణిరో యుల్ల ములోనిపుడు ॥కొ॥ ఉన్నతముగ చిత్కళలతో చెన్నుమీరగను మన్ననతో గురు మార్గము దెలిసితె సన్నుతాంగినీలో స్వామిసద్గు రు మూర్తి ॥కొ॥ మట్టుమీరగాను కుండలియనె పెట్టియలోన గట్టుమీదనెపుడు ఘనతేజలింగమై కాంతి ప్రకాశించు కలిచే చి త్కళలతో ॥కొ॥ యెరుకలోపలను మరుపులేని యెరుక తాన గును యెరుకె పరమశివుడని యెరిగిన శివయోగి రుద్రభావము లోనె బాయక సద్గురుడు ॥కొ॥

### కాఫిరాగము - ఆటతాళము

సోహం సోహంహంసోహం సోహం సోహమనరా సత తం హంసోహమనరాసతతం॥ భూషణ మేలరా భూషణులకును నీమదిలోనె రోష రోషపడకురాసతతం ॥సో॥ మానక షడ్వర్గము లను ఖండించి మాయలో మాయలో మాయగనరాసతతం ॥సో॥ పొందుగ భ్రూమధ్య మందిరమందునవాదిలోతుగదరా దానిలోతు గనరా సతతం ॥సో॥ కలగనిమేల్కానిలో నిదానించి వెలుగులో వెలుగు వెలుగుగనరా సతతం ॥సో॥ అంబరవీధినియాడుచు పా డుచుచూచుచునిరాలంబముక్తికాంతనుముక్తినిగనరాసతతం ॥సో॥ అరయగ శ్రీతరిగొండ వరహాడి శంకరా బాయ్యడే యాచార్యుల గనరా సతతం ॥సోహం॥

# కా ల జ్ఞా న త త్త్వ ము లు.

## మాయామాళవిరాగము - ఏకతాళము.

శివుడంటెనేమి కేశవుడంటెనేమి శివకేశవుల చిత్తస్థిర బేధమేమి ॥శి॥ రతిరాజు భ్రమలచే రట్టయ్యేదేమి మతిమంతులై తె యీ మతబేధమేమి ॥శి॥ మంచువంటిది దేహమని యెంచలే రు మించుబోణులగూడి విఱ్ఱవీగేరు ॥శి॥ మంచిది కానిది మది నెంచలేరు పంచేంద్రియములబడి పొరలేరు ॥శి॥ అహహా దేవుడే అచ్యుతుడాయె శ్రీ మహావిష్ణువే శివరూపమాయె ఈ మహాసత్యా ర్థమిది నిత్యమాయె ధాముడే నరసింహధాముడు తానాయె॥శి॥ తమ శము బోదాయె తాల్మిలేదాయె తమగతిగానకతహతహలాయెస్వా మి శ్రీతరిగొండనరహరియాయె నామాద్రివాసుడే శివశంభుడాయె

## ఆనందభైరవిరాగము - అటతాళము,

జ్యోతి వెలుగుచున్నదమ్మా దానిలోతు తెలియరాదె కొ మ్మా పాతాళగగన కళాతీతమై సర్వభూతములందు ప్రఖ్యాతిగ పరమాత్మ ॥జ్యో॥ యెవరిచే చిక్కదోయమ్మా దానివిధమిట్టిదని చెప్పరాకుగదమ్మా శివకేళిలోగూడి సిద్ధేంద్ర భావమెంచ నక్రియ మున చాల బుధులందున యాత్మ ॥జ్యో॥ మాయలో మాయమ యినదమ్మ దాని మహిమ తెలియగూడదమ్మ మాయకులోగాను మాయకు వెలిగాను రేయుబగలు నొక్కరీతిగ పరమాత్మ ॥జ్యో॥ నానారూపము లయినదమ్మ తిరిగి తాను తానై యున్నదమ్మ పూని త్రికూటమున నిత్యానంద జ్ఞానములో నిదానముగ నాత్మ ॥జ్యో॥ కనకమై యున్న దమ్మ తిరిగి కనవచ్చు కనరాదో యమ్మ ఫణితోడ గూడి పగలురేయొక రీతి తనువులోపల

## కాలజ్ఞానతత్త్వములు.

నీల తామర రసము నందు ॥జ్యో॥ యెఱుకాలో యెరుకైనదమ్మ దాని మర్మమెరిగితె సాక్షియైయున్నదమ్మ పరమాణువుగా విశ్వ పరిపూర్ణముగా నాత్మ గురు చంద్రుడగు శ్రీ తరికొండ నరహరి రూపమున ॥జ్యో॥

### నాదనామక్రియరాగము - చాపుతాళము

బ్రహ్మమేదో దెలుపరయ్యా బ్రాహ్మణులార పరబ్రహ్మమేదో తెలుపరయ్య బ్రాహ్మణులారా బ్రహ్మమేదో దెలుపరయ్యా భ్రాంతిలేక జీవునకు కర్మమోక్షరహితమైన గతికి పొయ్యేటందుకు బ్రహ్మ నిర్మలాంతః కరుణలగుచు నిత్యం ఏకాక్షరం పర బ్రహ్మం సత్యంబను శృతి మీరెరిగి నందుకు ॥బ్రహ్మ॥ బ్రాహ్మణ కర్మములను జేసికొనుచు గాయత్రి మంత్రము చదివి బ్రహ్మసూత్రమను నిష్ట బ్రహ్మాదిపతి బ్రాహ్మణో మమ దేవతాయను భావమెరిగినందుకు ॥బ్రహ్మ॥ రేపుమాపు సంధ్య వార్చి రేచించి ఓంకారమందు ఆపోజ్యోతి హం సోహం స్వాహేతి యని మీరెరిగినందుకు ॥బ్ర॥ యజ్ఞ క్రతువులనుచు మీరు యాగము యోగములుచేసి తర్గోదేవస్య ధీమహి పవిత్రుర్భవతి భావంబెరిగినందుకు ॥బ్ర॥ ప్రాణోపాన వ్యానోదాన సమానములను గూర్చి ప్రణవదానుతై వేదాంతం సోమపానం యజ్ఞస్వరంయసి మీరెరింగినందుకు ॥బ్ర॥ ప్రొద్దెరిగి ప్రొద్దునలేచి ప్రొద్దుచెప్పెడి పంచాంగము సద్దాలందు ఓం నమో బ్రహ్మ ప్రజాపతిం ధ్యాయే యని మీరెరింగినందుకు ॥బ్ర॥

ఇందు లేదురా తరిగొండ భ్రమరాంబ పూర్ణకుండలి ప్రణవ మహాత్మ్యంబు బ్రహ్మణ్య మిదియని వారెరిగినందుకు ॥బ్ర॥

నాదనామక్రియరాగము - ఆటతాళము.

జీవానీవునినుగానలేవా నిన్నుభావించి చూచితె బ్రహ్మంబు గాదా ॥జీ॥ పరగమేడిపండులోన తరచుగ పురుగులు తొలిగేటి పండు తెరచాటు మాంసపుదిండు దీనితెగిగెల్ల చక్కగా తెలిసిన పండు ॥జీ॥ ముసుకొని తొమ్మిదితూట్లు ఈతనువు కారణమని తగనమ్మెదెట్లు గనుగొని దీనిలో గుట్టు చాల పనిబూని వినబోతె బహు సిగ్గుబాట్లు ॥జీ॥ బలురోగముల కిదిబాట దీని వలపు సొలవులెల్ల వడగండ్లమూట నరయ స్వప్నప్రాయమకట నీవు తెలిసితే తొలిసేవ నీకిదే బాట ॥జీ॥ పరమ దేహముమంటిపాలు యీ వికట సంసారము విడిచితే మేలుసకల భోగములింకచాలు శ్రీయకలంక తరిగొండ హరిమమ్మేలు ॥జీవా॥

కాలజ్ఞానతత్వములు - సంపూర్ణము.

శ్రీ [illegible] ప్రింటింగ్ ప్రెస్ కడప C 26 కా 5000 కే 16-9-46

# ప్రకటన.

## శ్రీ విఠల్ విలాస్ బుక్ డిపో కడప.

మావద్ద భారత, భాగవత, రామాయణములు, వీధి నాటకములు, స్టేజీ డ్రామాలు, కథలపుస్తకములు, అన్నిరకముల టీకా - తాత్పర్యములుగల పుస్తకములు, వేదాంత గ్రంథములు, హిందీ పుస్తకములు, దొరకును.—

ఇవిగాక విద్యార్థులకు పనికివచ్చు అన్నిరకముల స్టూడెంటు ఎక్సర్‌సైజు, డ్రాయింగు పుస్తకములు, పాకెట్ నోటుబుక్కులు, ఎకౌంటుకు పనికివచ్చు అన్ని సైజులలో లెడ్జర్ పుస్తకములు, మంచి పేపరులో సరసమైన ధరలతో విక్రయించెదరు.

# విఠల్ విలాస్ బుక్ డిపోవారి
# స్వంత ప్రచురణములు.

---

గంధమంటిన్నియు మంచి తెలుపు కాగితములలో క్రవున్ సైజులలో అందముగా ముద్రించినారము.

| | | | |
|---|---|---|---|
| 1. | కాలజ్ఞాన తత్వములు. | వెల | 0-8-0 |
| 2. | కలియుగమహత్యమను వచనకాలజ్ఞానము | ,, | 0-5-0 |
| 3. | నారాయణ శతకము. | ,, | 0-2-0 |
| 4. | శ్రీ సింహాద్రిపురదిగంబరస్వామిజీవితము | ,, | 0-4-0 |
| 5. | మహేశ్వర శతకము. | ,, | 0-2-0 |
| 6. | శ్రీమదొంటిమిట్ట కోదండరామభజనామృతం | ,, | 0-4-0 |
| 7. | ప్రేమవిజయము. [సాంఘిక నాటకరాజము స్టేజి డ్రామా. | ,, | 1-0-0 |
| 8. | పెద్దబాలశిక్ష .... .... | ,, | 0-12-0 |
| 9. | ఆర్యవైశ్య నిత్య కర్మానుష్టానము | ,, | 0-2-0 |
| 10. | శృంగారపద్యములు. | ,, | 0-5-0 |
| 11. | కలికామహత్యము | ,, | 0-2-0 |